## పుష్పాలుచయనము జీవ హింసయే

౧౧ వ సంపుటము ౧౦ వ గోలకొండపత్రిక మూడవపేజీయందు "పుష్పాలుదిచయనయాగమే, జీవహింసకాదు" అనుశీర్షికగల వ్యాసమును చదివితిని. నాకు మిక్కిలి సంతాపము కలిగినది. వ్యాసమును రెండు మూడుపర్యాయములుచదివితినిగాని, ఆవ్యాసముయొక్క ముఖ్యోద్దేశ్యము యెవరోధూతిపయాగల పత్రికాత్మ ది. ౧౧-౬-౧౯౩౬ (ధాతనామసంవత్సర జ్యేష్ఠ॥ ౭ గురువారం) గోలకొండపత్రికలో "పుష్పాన్నోలుచయనమా, జీవహింసయా" అని వ్రాసినవ్యాసము అనామకము, దానియందుఅక్షరములయొక్క పొరపాట్లుగలవు, భావయందుగలశబ్దములు సాధువులుకావు, శ్లోకములయందు అశుద్ధములుపొరపాట్లుకలవు. ఈరీతిని. కేవలము పటాటోపము గా ఆడంబరమటయని తోచుచున్నదేకాని యుక్తియుక్తముగాను, శాస్త్రప్రమాణములచేతను, సమాధానము వ్రాసినట్లుపనిపించుటలేదు. విద్వాంసులు ఏ పని లేఖయందుగల సారాంశమునుమాత్రమే గ్రహింతురుగాని, ఇట్టిస్వల్పములు పాటింతురా? తమ లేఖయందిట్టి స్ఖాలిత్యాలు లేవా? చూడుడు.

### అహింసయని దేనినందురు

శ్లో॥ కర్మణా మనసా వాచా సర్వభూతేషు సర్వదా। అక్లేశజననం ప్రోక్తా త్వహింసా పరమర్షిభిః॥

కొట్టుట, తిట్టుట, చంపుట మొదలగుకర్మలచేతనున్ను, మనస్సునందు యితరప్రాణులను చంపుటకుగాని, లేక మరియే విధము చేతనైనను బాధించుటకుగాని తలపకుండుట, వాక్కుచేత యితరప్రాణులకు యేమాత్రము కష్టము[దుఃఖము] కలిగించకుండుట అహింసయని మహాజనులుపేర్కొనుచున్నట్లు పైప్రమాణముచేత నిశ్చయింపబడుచున్నది. అహింసయన నిట్టిదని మనహిందూసిద్ధాంతములు ఘోషించుచుండ, పైనాటిపత్రికలో దగువనుదహరింపబడిన శాస్త్రచతుష్టయమును, ఇంకెవరో ఒకరుకలిసి "పుష్పాలుది చయనయాగమే, జీవహింసకాదు" అని వ్రాయుటకు సత్యమగు హృదయముతో కలమునెత్త లేదనితోచుచున్నది. యెందుకనగా కొన్ని నోరులేనిజీవములయొక్క నవరంధ్రములను గాలాడకుండునట్లు బంధించి ఊపిరిసలప ఉక్కిరిబిక్కిరికొను మేకలను ఛేదించుట హింసకాదా? ఇదియునుగాక యేమైన మంత్రములుగాని, గోళ్లుగాని అగ్నియందుపడినయడలయెంతో దుర్గంధమువచ్చుచుండును. దుర్వాసనవల్ల కొన్ని జబ్బులు కలిగినకలగవచ్చును.

ఇదిగాకమహాభారతమునందు, శ్లో॥ అహింసా పరమోధర్మః స్తథాహింసాపరోదమః॥ అహింసాపరమందానం అహింసాపరమంతపః॥

అహింసయే పరమధర్మము. అహింసావలంబనమే ఇంద్రియములను జయించుట. అహింసాప్రచారమే గొప్పదానము. అహింసాప్రచారమే గొప్ప తపశ్చర్యయని చెప్పబడియున్నది. గాన హింసచేయకూడదు.

### అనామక వ్యాసము

"అనామకవ్యాసమునుచూచితిమి. వారుతమ పేరులేనివ్యాసమువ్రాయుట, సనాతనధర్మాభిమానులకుభయపడియో, జరుగబోయెడిసభలలో వాదించుటకు భయపడియో తెలియదు. అని వ్రాసిరి.

ప్రపంచకమునందు స్వార్థపరులగు మానవులు తమపేరు ప్రసిద్ధికెక్కవలయునని ప్రయత్నించుచుందురుగాని ఉదారచరితులు, దేశసేవచేయుటయే తమధర్మమని పాటుపడుచుందురు. అట్టివారినే అనామకవ్యాసకులని భావింపదగునా? తమవ్రాతవల్ల తాము స్వయముగా భయపడుచున్నట్లు తెలియుచున్నది. అది యెట్లన "మీరువ్రాయులేఖలకు సమాధానము వ్రాయవలసినబాధ్యత మాకులేదని యీ పత్రికాముఖముగా తెలుపుచున్నాము" అని వ్రాసియుండిరి.

అయ్యో! బహిరంగసభలయందు వాగ్వివాదము మాత్రమేర్పడి ఒకరినొకరు నిరాకరించుటమాత్రమేర్పడునుగాని యథార్థమేర్పడుటయసంభవముగా తోచుచున్నది. ఇదియునుగాక సనాతనులవారి అజ్ఞానికములకును, స్వయంప్రయాసలకునుకూడ మిక్కిలి శ్రమనుపడవలసియుండును. కాన లిఖితమూలకముగా ఇట్టిపత్రికా మూలమున ప్రకాశింపబడుచున్నయెడల, ప్రజలందరును సావధానముగా మంచిచెడలు తెలుసుకొనుటయేగాక, విషయముకూడ నిరూపణముగ తేలుచుండును. కాన పత్రికాముఖముగా నీవిషయము చర్చింపబడవలయును. ఇట్టిసరళమగు పద్ధతికి మేము సమాధానమొసగమనుట భయపడుటగాక మరియేమగును.

### భగవద్గీత

"గీతలు జ్ఞానమును ఉపదేశించు గ్రంథముగాని కర్మ నుపదేశించునదిగాదు" అని వ్రాసిరిగాని ఇది పొరపాటు. "నహికశ్చిత్ క్షణమపిజాతుతిష్ఠత్యకర్మకృత్। కార్యతేహ్యవశః కర్మసర్వః ప్రకృతిజైర్గుణైః॥ అని భగవద్గీతయందు స్పష్టముగా వ్రాయబడియున్నది. అనగా దేహి ఒక క్షణమాత్రముకూడ కర్మలను చేయక నుండజాలడు. ప్రతి దేహధారియును ప్రకృతి సంబంధమగు సత్వరజస్తమో గుణములచేత అవశుడై కర్మలను చేయుచుండును. గమనాగమనములు ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఉన్మేష నిమేషములుకూడ కర్మలయందే చేరినవి. కనుకనే కర్మలు అనివార్యములైనవి "కురుకర్మైవతస్మాత్త్వం పూర్వైఃపూర్వతరంకృతం" హే అర్జునా! పూర్వులచేత అనుష్ఠింపబడిన కర్మలను నీవుకూడ అనుష్ఠింపు" మని, కృష్ణభగవానుడు. భగవద్గీతయందు బోధించెను. ఈరీతి కర్మనుకూడ బోధించు భగవద్గీతను కర్మబోధకము కాదనుట ఆశ్చర్యజనకముగానున్నది.

బౌద్ధులయందు తిరిగి అహింసా ప్రచారము చేయరాదాయనిగాని మీరు విశాలమగు హృదయముతో యోచించినయడల నీరీతి వ్రాయరని నాతలంపు ఎందుకనగా వీయేజాతులయందు ప్రధానముగా హింసలు జరుగుచుండెడికో, వారుచాలవరకు హింసలనుమాని వైచుచున్నారు. వెర్యేల మన సహోదరులగు హరిజనులుకూడ హింసాదికములను వదలి, కొంచెడపోనిన నెయ్యివలె సిద్ధపడుచున్నారు. గొప్ప గొప్ప పండితులుకూడ వీరి హృదయముతో తమహృదయమును కలుపుచున్నారు: ఇట్టిప్రయత్నములన్నియును. అట్టి ఉదారపురుషుల ప్రయత్నములనుటకు సందేహములేదు. ఇదియునుగాక "యద్యదాచరతి శ్రేష్ఠః స్తత్తదేవేతరోజనః। సయత్ ప్రమాణం కురుతేలోకస్తదనువర్తతే" ప్రపంచములోజనులు, సత్పురుషులు యేరీతి ఆచరణలు చేయుచుందురో ఆరీతిగానే, వారి ఆచరణలనే ప్రమాణముగా నెంచి తాముకూడ వారి ననుసరించుట సహజముగ గాన్పించుచున్నది. గాన తాము ఇట్టి కృత్యములను మానివేసినయెడల, అతి శీఘ్రకాలములోనే, మిగిలిన వారుకూడ బాగుపడగలరు.

### సత్యాన్వేషణ

ఈయాగము ప్రప్రథమమున పాతవారధికివెనుకనున్న స్మశానవాటికకు ప్రక్కనున్న దేవిబాగునందు జరుపుటకు నిశ్చయింపబడెను. తరువాత యాగమునందు హింసచేయబడునని తెలిసి అక్కడికొందరు జనులును. పూజారులును నిరాకరించినట్లు పూజారివల్ల తెలియవచ్చుచున్నది. సికింద్రాబాదు విషయము సావధానముగ తెలుసుకొందుము.

ఇట్లు
కవిరాజ, శివవల్లభాచార్యః
[ధూలిపేట, హై. ద.]



## చక్కెర పరిశ్రమ

మొదటిపేజి తరువాయి

మగనిచ్చి, అన్నిటికి ౧౧౫ మొదలకొని ౧౩౦ లవరకు సెంటిగ్రేడు ధర్మామీటరులెక్కప్రకారము లీసుకొనవలెను. ఇప్పుడురసముచక్కబడి ఒకవిస్తారమైన పాకముగా తయారగును. ఈచివరపళ్లెమును ఈపాకము వచ్చినవెంటనే బొయ్యిపైనుండితీసి రసమును కుండలలోకిగాని, కిరసనాయిలు డబ్బాలలోకిగాని ఎక్కించి గరిటెలతో ఎత్తి గాలితగులునట్లు పోయవలెను! ఇట్లుచేసినయెడల నలకేల [Nucbi] వంటి క్రిష్టల్సు తయారైక్రమముగా [illegible] ౧౫, ౨౦ రోజులు వాటినిఅట్లే యుంచవలెను. అప్పటికి క్రిష్టల్సుపెరిగి వాటిచుట్టు మిగిలిన మొలేసస్సు Molasses [రసము] యుండును. దీనినిఇప్పుడుసంట్రిఫ్యూగలు [Outrifugal] మెషినులో వ్రేసినయెడల మెషినులోని జల్లెడవంటి తెరనుండి ఈ మొలేసస్సుబయిటకు వచ్చి లోని తెరకు తయారైన పంచదార క్రిష్టల్సు అంటుకొనియుండును. వీటిని నీటితో కడుగవలయును. ఇంకను రంగుగానున్న స్టానస్సుక్లోరైడు [Stannous Chloride] సొల్యూషనుతోగాని, రంగుసీళ్లతోగాని కడిగినకొంత మట్టుక తెల్లపడును. ఈచక్కెరను సెంట్రిఫ్యూగలునుండితీసి గాలిలో బాగుగ ఆరనిచ్చి మరి గోతాలలోకి ఎక్కించవలెను. తడిగానుండగానే గోతాలలోకి ఎక్కించిన, తడిగానున్నచోట పెలేసనంతయుకూడి నల్లనిరసముగా యాలు దేరి పుగుక్రిష్టల్సును తినివేసి పంచదారనంతయు పాడుచేయును.

పైనరసమును శుద్ధపరచుటకు బిండి, సజ్జనీగ్లసేకాక ఇంకను అనేక పదార్థములున్నవి. డయోలా, ఆముదపుగింజలు రసము మొదలైనవి. [రాబు] [బూరా] మొదలైనవికూడ పైవిధముననే తయారగుచున్నవి. కాని దేని పాకముదానిదే. "రాబు" పాకము రావలెనన ౧౧౦ మొదలుకొని ౧౧౨ వరకు మరిగించవలెను. "బూరా" పాకము "గుడు" పాకముకన్న మెదురుది.

పైచెప్పబడిన పద్ధతిని రోహిలుఖండు సిస్టము [Khaudsani System] అందురు. దీనిలో చాలలోపములుకలవు. దీనిలో బొళ్లలు చాలపెద్దవిగా నుండుటచే తోయుటచాల కష్టము. రసములోను, కలిపిన శుద్ధిపదార్థములలోనుకూడ కనుకల్సు ఇనుముతో నల్లని కాంపౌండ్లు [Compounds] గా తయారై పాకము నల్లగానుండి తీయబడినచక్కెరకూడ నల్లగానుండును. రసములోనిఆసిడీలు [Acids] వేడినిపట్టి సూక్రోజును మార్చివేయును, [inversion by acids and heat] ఈనష్టము ఎక్కువసేపు మరిగించుటవల్లకూడ నగును. ఇంతేకాక మంటసరిగా అందకపోయినసరియైనపాకమువచ్చుట ఆలస్యమగును. లేకున్న ఎక్కువవేడి తగిలినచోట రసముమాడి వాసనవచ్చును, దీనినే "కారమిలైజ్" అందురు [Carama lization]

### భోపాలుపద్ధతి

ఈ లోపములన్నిటిని సరిపుచ్చుటకుగాను పళ్లెములయొక్క ఆకారములోను వరిసలోను అనేకమార్పులు వచ్చినవి. పొయ్యికూడ అనేక మార్పులను పొందినది. ఇప్పుడు ౫,౬ మొదలు ౧౧ పళ్లెములవరకుకూడ వాడుచున్నారు. ఇట్లు సరిపుచ్చి వాడకలోనికి తెచ్చిన క్రొత్తపద్ధతినే [Bhopal system] భోపాలుసిస్టము అనియు, పళ్లెములవరుసను "భోపాలు"అనియు వాడుచున్నారు. దానిలోకర, బొగ్గుఅక్కరలేకయేపిప్పితో సరిపుచ్చవచ్చును. ౯ మొదలు ౧౬ రోజులలో పాకము క్రిష్టన్సుతో నిండియుండును. సజ్జ, లైము మొదలగునవి కొద్దిగనే వాడుటకు వీలుండును. పళ్లెముల అడుగుమట్టముగానుండుటచే కారమిలైజేషను తక్కువగునుగనుకయు ఒకచోకూడ కొనును.

ఈ పద్ధతి చిన్నరైతులకు చాలఉపయోగకరముగనుటచే కొంతవివరముగ వ్రాయుటయైనది. ఇంకను అనేకవిధముల జాగ్రత్తపడవలసియున్నది. రైతులను తమకర్చులుపోను లాభమురావలెనన్న పైబెప్పుతప్పులను ఒకరిసలహా తీసుకొని సవరించుకోవలసి యున్నది. రైతులకు అయినకర్చుపై రోహిలుఖండుసిస్టము మూలమున నూటికి ౧౫-౧౯ భోపాలసిస్టమువల్ల నూటికి ౨౫ ను లాభమువచ్చును.

## గద్వాల సంస్థానము

### సందుకొను ఈతచెట్టు

(స్వకీయ విలేఖరి)

గద్వాలలోచేరి గద్వాలకు ౨౦మైళ్ల దూరములోనున్నవడ్డేపల్లిఅను గ్రామములో కొన్ని వారములనుండీ యొక ఈతచెట్టు భూమిపైవాలుట మొదలుపెట్టెనట. ఈదులుగీయు ఈడిగ సాయంత్రము చెట్టుకునిచ్చెన వేసుకొని లొట్టి కట్టిపోగా ప్రొద్దుటవచ్చువరకా చెట్టు భూమిపై వాలుటచూచి వంగి దానిలొట్టిని విడుచుకొనుచుండెను. ఇట్లు ౪-౫ దినములనుండి రక్తము రాబట్టెనట. అందుపై వాడు బెదరి లొట్టికట్టుట మాని అందరికి తెలిపినాడు. రాత్రి౧౦-౧౧ గంటలనుండి చెట్టు క్రమముగా వంగుట ప్రారంభముచేసి పగలు ౧౧-౧౨గంటలవేళ వరకు పూర్తిగా భూమిపై రాలిపోవును మరల ౧౨నుండి రాత్రివరకు క్రమముగా లేచుచు యథాస్థానమునకు వచ్చును. ఈవింతను చూచుటకు జనులు చుట్టుపట్లులనుండి దినము గుంపులుగుంపులుగా వచ్చుచున్నారు. కొందరు టెంకాయలుకొట్టి ప్రదక్షిణముచేసి పోవుచున్నారు. తాలూకుదారుగూడ ప్రత్యక్ష దర్శనము చేసుకున్నారు. దానిఫోటో తీసుకొని బొంబాయి పత్రికకు పంపినారట. సంస్థానము కల్లు మాములా ఖాల్సా సర్కారువారు తీసుకున్న కాలములో యీచెట్టుకేమి దుర్బుద్ధిముదిరినదో యిట్టి విపరీతములకు దిగినదని జనులు పరిపరివిధముల అనుకొనుచున్నారు.

### ఆత్మహత్య

ఆసిఫాబాద ౨౦ అమర్దాదు

విద్యాశాఖ ఉద్యోగియొకడు ఆత్మహత్యచేసికొనెను. ఇంటిసంబంధమైన కొన్ని ఇబ్బందులవలన ఇట్టిఘోరము జరిగినదట.

## గ్రామ సమాచారములు

### శ్రీచల్లావెంకటకృష్ణ శివ యోగీంద్ర స్వాముల వారి సమాధి ప్రవేశము

కృష్ణాజిల్లా నందిగామతాలూకాలోకూడవియను మహాక్షేత్రముగలదు. అచ్చటరెండునదులు కలియుటచేత నాగ్రామము కూడలియని పిలువబడుచుండును, ఇక్కడ ఒక పెద్దదేవాలయము కూడాగలదు అందు సంగమేశ్వరమూర్తిగలదు. లింగమును పూర్వమొకమహర్షి ప్రతిష్ఠించెననియు, తరువాత వకముత్యాలవర్తకుడు ఆలయమునుకట్టించెననియు, యీక్షేత్రము నలుప్రక్కలగల గ్రామవాసులు వాడుకగా చెప్పుచుందురు, తరువాత శ్రీ॥శ్రీ॥ వాశిరెడ్డి వెంకటాద్రినాయుడుగారి ప్రభుత్వములో, సదరు ఆలయమునకు, ముఖమంటప, కళ్యాణమంటప, శిఖరప్రాకారములనుకట్టించి నిత్యనైవేద్య దీపారాధనలు సక్రమముగా జరుగగలందులకు ౭౦ ఎకరములుభూమిని సర్కారుశిస్తు మాఫీ చేయించి యినాముగానిచ్చియున్నారు. ఇంతవరకు శ్రీశ్రీశ్రీవారిగోత్రములనునిత్యము అర్చకస్వాములు చెప్పుచుందురు. ఇటీవల అనగా సుమారు ౩౦-౩౫ సంవత్సరముల్కిత్రము, దీనికి దాపుగానున్న దాములూరుగ్రామస్థులు, వక విష్ణ్వాలయమునుకట్టించి, దానిని తగుయేర్పాట్లుచేసియున్నారు ఆట్టిసంగమములో, హరిహరులుండుటనుబట్టి, పుణ్యస్థలమునిర్ణయించి, చల్లా వెంకటకృష్ణ శివయోగీంద్రులవారు, విచ్చేసియుండిరి.

(౨) వీరిజన్మస్థానము పల్నాడులోచేరిన పుప్పలమడక గ్రామము, వీరువెలనాడుబ్రాహ్మణులు ఇరువురన్నదమ్ములలో వీరుకనిష్ఠులు ఆగ్రామమునకు సమీపముగానున్న అరణ్యమునకు, సమిధలనిమిత్తముయివెళ్లి, అచ్చటనివసించియున్న సాధువునాశ్రయించి, వుపదేశములనువడసి, గృహస్థాశ్రమమునువదలి, బ్రహ్మచర్యమునుబూని, యీకూడవిక్షేత్రమునకు సుమారు ౩౦ సంవత్సరముల్కిందటవచ్చి ఆశ్రమమునిర్మించుకొని నివశించియుండిరి. వీరికి సంస్కృతమునందు పాండిత్యముగలదు, ఫిడేలు, మురళి అను బాగుగావాయించగలరు, మాండుకనాయిద్యముఅనగా, నాలుగుచిన్న కర్రబద్దలను రెండుచేతులనుబూని, మద్దెలితోకూడా భరతమునువాయించగలరు.

వీరికి ౨౦౦ పైగా శిష్యులుగలరు వారిసహాయమునరాజరాజేశ్వరీ విగ్రహప్రతిష్ఠగావించిరి,

ది ౨౦-౬-౩౮ తేదీన శ్రీస్వాములవారు చుట్టుపట్ల గ్రామాదులలోగల, వారిశిష్యులను రావించుకొని, రెండుమూడు రోజులవరకు, నన్నెడబాయవలదనియు, నేనుస్వర్గీయుడవగుదుననియుజెప్పి వారలను తనసన్నిధిలోనుంచుకొనియుండిరి. గాని వారిశరీరమునందువేరేరుగ్మతులుగాని, వాగుపన్యశించు నీతివాక్యములయందు పొరబడుటగాని, దినకృత్యములయందు మందగింపుగాని, అచ్చటకాచుకొని, అనేకోపచారములను భక్తిశ్రద్ధలతో జేయుచున్నవారలకెవరికిని కాన్పించియుండలేదు.

ది ౨౨-౬-౧౯౩౮ తేదీన ఉదయము అచ్చటనుండు వారలందరు నిత్యకృత్యములనుదీర్చుకొనగలందులకై నదిలోనికివెళ్లి వచ్చేసరికి శ్రీస్వాములవారు పద్మాసనులయి స్వర్గమునలంకరించియుండిరి. అంత శిష్యబృందమంతయు, నిర్జీవప్రతిమలవలె నిర్విణ్ణులయి, చకితమానసములకొంత వడచింగించి ఆపాదమస్తకమును పరికించి భక్తిశ్రద్ధలతో పూజలొనరించి, సాష్టాంగ దండప్రణామంబు లాచరించి సమాధిబంధించినైచిరి. ఇట్లు

శ్రీబాలభక్త పుస్తకభాండాగార
భజనసమాజము, మదుపల్లె

### కల్లుదుకాణమును ఊరిబైటికిలాగుటకు తాలూకాదారుఆజ్ఞ

సేడం: 3 అమర్దాదు:—

కొన్నిదినములకుపూర్వము మంగలాధికారి గారొ వైవచ్చిరి. పురజనుల ఇష్టముపై కల్లుదుకాణమును ఊరుబైటికి మార్చుటకు ఆజ్ఞ ఇచ్చిరి. ౫ అమర్దాదు నాటిరాత్రి న్యాయాధికారిఇంట దొంగలుపడిరి గాని, సమయానికి చుట్టుప్రక్కలవారు మేల్కొనగా పారిపోయిరి.

ఇట్టివేషంకకొన్ని దొంగతనాలు జరిగినవని తెలియవచ్చినది.

### పురపాలకసంఘపు ధనాపహరణము

కరీంనగరము ౨౧ అమర్దాదు

స్థానిక పురపాలకసంఘపు పన్ను వసూలుచేయువాడు సుమారు రూ ౧౬౦౦ ల అపహరణముజేసి, ఆలుబిడ్డలసహా పారిపోయెను. ఈ సమాచారము తెలియగా కొందరధికారులు వానివెంటబడి, సిద్ధిపేటలో చిక్కించుకొనిరి. ధనాపహారి రక్షకశాఖవారి కొప్పగింపబడెను.

## సికిందరాబాదు అంబేద్కరు పక్షీయులు

మాతాపూజను నిషేధించుట

సికింద్రాబాదులో అంబేద్కరుగారి పక్షమునకు జెందినహరిజనయువకులు ఒకయువక సంఘమును స్థాపించియుండిరిగదా. వారలు సికింద్రాబాదులో జరుగబోవు మహాకాళి ఉత్సవములో తమకులస్థులు పాల్గొనరాదని ప్రచారము చేయుచున్నారు.

ఉద్యోగ విషయములు

ఈక్రిందివారు ప్రభువుగారి ఫర్మానుద్వారా నెలకు రూ ౫౦ల అలవెన్సుపై హైదరాబాద ప్రభుత్వపు సైన్యమున కేడెట్సుగా నియమింపబడిరి.

గులాంఖురేషి, సయ్యద్‌అమీరొద్దీన్ ఖాన్ సఫదరలీమిర్జా, మీరు ఖాసింఅలి

మంజూరీలు

మహారాజాబహాదరుగారి అజ్ఞానుసారం, హోంసెక్రెటరీ ప్రతిపాదనపై విద్యాశాఖనా జంగారి సిఫార్సుపై మదరసెదీన్యాతులో ఉపాధ్యాయులుగానున్న మహమ్మదు గౌసుగారి వితంతువుకు జీవితభరణము మంజూరుచేయబడెను.

మహారాజాబహాదరుగారి ఆజ్ఞానుసారం, సయ్యదు నూరుమన్సబ్దారుకు ౧౬ సంవత్సరముల మొత్తముకుబదులు అతనికున్న ౩-౪-౫ మన్సబును వీడికొనుటకు మంజూరు చేయబడినది.

— సుల్తానుబజారులోని అనాధవిద్యార్థి గృహమునకు, నవాబు కమాలుయార్జంగు బహాదరుగారు తమ జన్మదినోత్సవ సందర్భమున ౫౦ రూపా. దానము చేసిరి.

—రెసిడెంటు బహాదరుగారి కార్యదర్శిగారు కొందరు స్థానిక ఉద్యోగులవెంట సికింద్రాబాద సినిమాలను పరిశీలించిరి.

## స్థానికవార్తలు

### శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయమున హరికథా కాలక్షేపములు

గతగురువారము, శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయమున, శ్రీమల్లాది దేవేంద్రుడుగారు. శ్రీరుక్మిణీకల్యాణము హరికథా కాలక్షేపము చేసిరి. కంభంపాటి సత్యనారాయణగారు ఫిడేలు: పుచ్చాసుబ్రహ్మణ్యంగారు మృదంగం, వాయించి సభికులనానందపరచిరి

హరిదాసు వేంద్రుడుగారు, నవ్య ప్రాచీనభావములనెరిగినవారు వారు పౌరాణికకథ వినిపించుచున్నను నేటిభారతీయునికుండు భావోద్రేకము, పతనదశనుండి, ఉన్నతస్థితిబడయునభిలాష, వారికుండుట-మధురాహారమధ్య ఊరగాయనంచుకొనునట్లు, కథాసందర్భమున సుధారణవిషయమై ముచ్చటించుటయె తెలుపరుచును.

హరికిగానమందేగాక, నృత్యమందున్నూప్రవేశము-అభినివేశము గలదనియు. నాటకపాత్రధారికి ఒకేపాత్రాభినయనభరముండునుగాని, హరికథలో, దాసు, పాత్రపాత్రకు అభినయము మార్చుచుండవలెననియు. అది చాల కష్టతరమనియు, కథాంతమున చెప్పిరి.

అంత, సుప్రసిద్ధహరిదాసులైన శ్రీబాలబ్రహ్మముగారు "ఏలాంటివాడు హరిదాసో" వివశదీకరించిరి.

వీరు (౫ జూను ౩౬-) రోజు ఈనిలయశక్షమునసే "ద్రౌపదీవస్త్రాపహరణ" హరికథా కాలక్షేపము చేసిరి ఆరోజు వైదేవేంద్రుడుగారిహరికథయని నిశ్చయింపబడియుండ, వారికే వో కొన్ని అంతరాయములుకలుగ బ్రహ్మానందముగారు కోరబడిరి. ఆదేరాత్రి ౯౻ గం. సికింద్రాబాదలో హరికథయున్నను లెక్కసేయక, నిలయవు ఆహ్వానమును స్వీకరించిరి. కథసర్వజనాకర్షణీయముగా నుండెను.

### ముల్కీ సర్టిఫికేటు అవసరములేనిసందర్భము

మహారాజా బహాదరుగారి ఆజ్ఞ

ఏదైన అవసరముపడినప్పుడు ప్రదర్శనశాలలో తాత్కాలికముగా నియమింపబడుఉద్యోగులకు, ముల్కీ సర్టిఫికెట్లు ప్రతిబంధకము లేకుండుటకు మహారాజా బహాదరుగారి ఆజ్ఞానుసారము మంజూరి ఇవ్వబడినది. అంత అవసరమైనచో వ్యాపారశాఖ కార్యదర్శిగారు తమ శాఖ వరకు తాత్కాలికముగా ముల్కీ సర్టిఫికేట్లు నివ్వగలరు.

## డాక్టర్ మెకంజిగారి అనారోగ్యము

ఉస్మానియా విద్యాపీఠాధికారి గానే యుండగోరిక

ఉస్మానియా విద్యాపీఠముయొక్క ప్రోవైస్ ఛాన్సెలర్ అగు డాక్టర్ ఏ. ఎచ్. మెకంజీ. సి. ఐ. ఇ, సి. యస్. ఇ, గారు ఇండియాప్రభుత్వముయొక్క యడ్యుకేషనల్ కమిషనరుగా నియోజించబడినారుగదా వారు ఆ క్రొత్తఅధికారమును స్వీకరించబోవుదురనితలచి మరియొకరు ఉస్మానియావిద్యాపీఠముయొక్క ప్రోవైస్‌ఛాన్సెలరుగా మెకంజీగారి స్థానమున నియోజించబడుటకు ప్రభువుగారి ఆజ్ఞ అయియుండెనుగదా! ఇపుడుమరల ౨౭ జూను నాటిహైద్రాబాదు బులెటిను పత్రికలో చెప్పబడిన ప్రకారము తెలియునదేమనగా, మెకంజీగారి అనారోగ్యస్థితిలో మంచిమార్పు కలుగలేదట, వారు తమక్రొత్తఅధికారములో చేరక ఉస్మానియా విద్యాపీఠప్రవైస్ ఛాన్సెలరుగానే యుండగోరుచున్నారట.

### కీ॥శే॥ అరుగొండ లక్ష్మయ్యగారు

ఈసామియాబజారులో వర్తకుడును, సంఘసేవాసక్తుడునునగు అరుగొండలక్ష్మయ్యగారు ఈవారములో కీర్తిశేషులైనట్లు తెలియుచున్నది. వారు ఉదారులని ప్రసిద్ధిజెందియుండిరి. ఆదిహిందూపాంఘిక సేవా సమితియొక్క కోశాధ్యక్షులుగ చాలఏండ్లుపనిచేసిరి. అంబర్‌పేటలో స్మశానసంఘముతోను, వివిధఆంధ్రసంఘములతోను, కమిటీలతోను సంబంధముగలిగియుండినవారు

# శ్రీ జగద్గురువుగారి ఆగమనము

(ఒక హిందువు)

శ్రీజగద్గురు శ్రీశంకరాచార్య దక్షిణామ్నాయ, శ్రీశృంగేరి శ్రీ శివంగస్వాములవారు, హైదరాబాదు నగరమునకు ౨ జులై గురువారమునాడు విజయము చేయుచున్నారనియు, వరంగల్లు, జనగామ, భోనగిరి మొదలగు స్థలములందు గొప్ప వైభవముతో ఊరేగింపులు జరిగినవనియు మన నగరమునకూడ పట్టిమర్యాదలు జరుపుటకును, శ్రీవారిచ్చట వింయము చేసినతరువాత నాల్గుమాసముల కాలముందురు కనుక వారికితగిన సపర్యలజరుపుటకును గొప్ప అహ్వానసంఘమొకటి ఏర్పడినదనియు తెలియుచున్నది.

ఇది సంతోషప్రదమైన విషయమే. కాని శ్రీవారియాగమనము, నాల్గుమాసములనగరనివాసము హిందూ మహాజనులకు లాభప్రదము కావ అయును. శ్రీవారికి ప్రతి దినము భిక్షలుజరుగును. నగరములోని ధనవంతులగువారి యాతిథ్యము విరివిగా లభింపగలదు. గజతురగ పదాతియుతమగు వైభవముతో ఊరేగింపులు జరుగగలవు. వారి శిష్యపరంపరకును, తదితరులకును షడ్రసోపేతమగు భోజనములు లభించుట నిక్కము. హిందూ మతగురువులగు వీరికి హిందూ మహాజను అధిక సంఖ్యాకులుగానున్న మన నగరమున ఎన్నియోమర్యాదలు జరుగుటలో నాశ్చర్యములేదు. శ్రీరాజా రాయరాయాన్ శ్యామరాజ బహదరుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగను, దివాన్ బహదరుఅరవముదు అయ్యంగారును దేశభక్త వామన్ నాయకుగారును ఉపాధ్యక్షులుగను, శ్రీయుత్ సూరు రంగధామాచాయుడు పాండురంగరావు జోషీ బి. ఏ. ఎల్ ఎల్. బి. గారు కార్యదర్శులుగను ఏర్పడిన తరువాత ఈజగద్గురువుగారికి కావలసిన మర్యాదలకు లోపముండదు. ఉండకుండుగాక!

అయినను, వీరివలన హిందూ సంఘమునకు ... ఉపకారమేమి? వీరు ఇప్పటికాలము ... నులకుకలుగుచున్న ఏవీ యిబ్బంది ... చ సంకల్పించియున్నారా? హిం... పునరుద్ధరించిన వర్ణాశ్రమధర్మము ... చెదరా? హిందూసంఘమున నే ... దేరిన నవీనమతముల ఖండించి సద్ధర్మమును స్థాపింతురా? సనాతనధర్మము ... నిర్వచనమును ప్రతిపాదించి హిందూజాతియందైక్యత సమకూర్చుటకు ఎట్టి యుపాయములనైన ఆలోచించెదరా? కడు హీనస్థితికిలోనై, హిందూమతమున తమకు కలుగుచున్న అవమానమునకువిసికి వేసారి సంతప్తహృదయులై, ఇందరు జగద్గురువులుండియు తమకుదిక్కుకనుపడక, తుదకు పరమతములలో చేరిన గాని తమకు శరణ్యములేదని తహతహపడుచున్న అస్పృశ్యులనబడువారిని శాంతిపరచుటకువీరు ఏమిప్రయత్నము చేసెదరు! బ్రాహ్మణేతరులగువారికి వేదాదికర్మల కధికారముండవలయునను, న్యాయమగు కోరికలనుతీర్పించెదరా? అవిషయము నాలోచించనైన ఆలోచించెదరా? నిర్బంధ వైధవ్యదుఃఖమున కుందుచుకన్నీరు మున్నీరుగావగచుచు, హిందూమతము పేరు చెప్పికొనుచు జీవచ్ఛవములవలెనున్న బాలవితంతువుల కష్టములతొలగించుటకు పూనుకొనెదరా? హిందూమతమునకు చెందిన వివిధకులములవారిలోను ఐకమత్యము కలిగించు మహద్విషయమును, పరమతములలో ప్రవేశించిన వారినిమరల హిందూమతములోనికి ప్రవేశము కలిగించి హిందూజాతిని బలపరచుటకు వీరు యత్నించెదరా? ఒకమాటలో, వీరుతమగొప్పతనమునకు, తమకుగల పలుకుబడికి, ఆదిశంకరులవారి ప్రాతినిధ్యమునకు యోగ్యమగునదేకార్యమునకు, తెగినవిధమున జగద్గురువైగా, హైదరాబాదు నగరవాసులకు వీరుచేయు నుపకారమేమి? అహ్వానసంఘమువారు వీరికెట్టికార్యక్రమమునిర్ణయించిరో తెలియదు. మొత్తముమీద హిందూసంఘమునకు నేడు ఆందోళనము గొలుపుచున్న మహావిషయములు వీరిదృష్టి నాకర్షించక వీరూరక నగరవాసులు ధనమును వ్యయము చేయించి, నాలుమాసములుండి వెళ్లినచో అది నిరుపయోగముగ నుండునని మాత్రము సూచించగలను.

అహ్వానసంఘములో పలువురు హిందూజాతినెరుగుచున్న ప్రస్తుతసమస్యల బాగుగా నెరిగినవారు కలరు. ఈదినములలోనే పూనా నగరమున జగద్గురు శంకరాచార్యులు (డా కురుకర్తకోటి)గారు వచ్చి హిందూవిద్యాధికులలోను, విద్యార్థులలోను జనసామాన్యములోను నవ్యసందేశమును ప్రవేశపెట్టుచు వారి సన్మానములనందుచున్నారు. మతేంగులను ప్రోత్సహించి, వారికి హిందూమతమును వదలకుండునట్లు ప్రబోధించుచు. వారికిధైర్యము అభయమునొసగుచున్నారు? ఇక మన నగరములో వీరెట్లుచేసెదరో? యేమో??

---

## కుష్ఠురోగవైద్యశాలకు లోకల్ఫండు ద్రవ్యసహాయము

మహారాజా సర్ కిషన్ ప్రసాద బహాదరువారి అజ్ఞానుసారము, డిచ్పల్లిలోని కుష్ఠురోగ వైద్యాలయమునకు, లోకలుఫండు ద్రవ్యమునుండి రూ. ౪౦ వేలు సహాయమిచ్చుటకు ఆజ్ఞ ఇయ్యబడినది.

---

మహారాజా సర్ కిషన్ ప్రసాద బహాదరుగారి అజ్ఞానుసారం, సయ్యదు ఘనీహుల్లాహుసేనిమన్సబుదారుయొక్క ౧-౧౫-౯ దినబత్తెముహక్కును, ౧౬ ఏండ్ల మొత్తముతీసికొని వదలుకొనుటకు మంజూరు చేయబడినది.

---

## ఎకానమి స్లిప్

రైటు ఆనరెబిల్ సర్ అక్బరు హైదరీగారి అజ్ఞానుసారం,

వ్యయమును తక్కువచేయుటకు, ఒలిఫాను పెక్కు-సార్లువాడుటకు, ఈక్రిందిపద్ధతి నవలంబించిన బాగుండును

౧. మామూలా కార్యాలయములు తిరిగివాడుటకు, అనుకూలముగా నుండునటుల, మజారియాకార్యాలయము వలిఫాఫాపై ఎకానమి స్లిప్ అంటించవలయును.

౨. మామూలా కార్యాలయమున, స్లిప్‌ను జాగ్రత్తగాతీసి, మామూలాచేసికొని మళ్లిమజారియా కొరకు అశాఖవారికిచ్చివేయవలెను.

౩. ప్రభుత్వముద్రాక్షరశాలవారు ఈస్లిప్‌లను అచ్చువేసి, అందజేయుదురు. అవిస్టాండర్డు సైజు, ౨ అణాలకు ౧౦౦ చిక్కును. ప్రతికార్యాలయమును, అవసరమునుబట్టి తెప్పించుకొని వాడవచ్చును. అవి ౧౦౦ కి తక్కువ దొరకవు. పై అంశములను అనుసరించి అమలుజరుగునని ఆశించుచున్నాను. ఒకసంవత్సరపు అనుభవముపై వ్యయములలో నెంతతక్కువయైనది ప్రభుత్వముద్రాక్షరశాల కార్యాలయమునకు తెలియజేయవలయును.

---

## సహాయము

టాస్కరు పతిగారివిన్నపముపై మహారాజా సర్ కిషన్ ప్రసాదుగారి అజ్ఞానుసారం, "దక్కను మహిళాసంఘము" నకు ౨౫౦ రుప్యలు సహాయార్థమిచ్చుటకు మంజూరిఇవ్వనైనది.

---

# ౮ నెలలు ఇంగ్లాండులో ౪ నెలలు ఇక్కడ

ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రొఫెసురుగా స్పెలను గ నున్న డాక్టరు మెకంజిగారికి శస్త్రచికిత్సజరిగినది. వారు, భారతదేశ విద్యాశాఖకు మిన్నరుపదవిని నిరాకరించిరి. ఏలయన, భారతదేశపుగాలినీరువారికిపైకృతికిగిట్టదు. ఇపుడీసమస్యపై ఇక్కడి విశ్వవిద్యాలయ ముఖ్యాధికారులుగమనించుచున్నారు. అది అంగీకరింపబడిన, వారు. ౮ నెలలు ఇంగ్లాండులోనుండి, చలికాలము ౪ నెలలు ఇచటపనిచేతురు.

---

## దినచర్య నివేదిక

మహారాజా కిషన్ ప్రసాద్ బహాదరుగారి అజ్ఞానుసారం, మాల్గుజారిగస్తీనె॥ ౧-౨-౧౧సఫరు ౧౩౦౦ హి॥ ప్రకారం, ప్రతిదారాచేయు ఉద్యోగి, తనపై అధికారికడకు ప్రతివారము దినచర్య పంపవలసియుండ, సుభేదారుల మహాసభలో, మెదకు సుబేదారుగారి ప్రతిపాదనపైచర్చింపబడి, ప్రతినెల ౫ వ తేది మండలాధికారులు తమదినచర్యనివేదికను సుబేదారులకడకు పంపుటకు మహారాజా బహాదరుగారి అజ్ఞయైనది.

---

## జాగీర్దారుల వ్యక్తిత్వము హక్కులు

మహారాజా సర్ కిషన్ ప్రసాద్ బహాదరుగారి అజ్ఞానుసారం, దఫా ౧౪, గస్తీనె॥ ౧౦ ౧౩౩౯, ప్రకారం, ౨౫౦౦౧, రుప్య. లేక అంతకుఎక్కువ ఆదాయమున్న జాగర్లకు రుప్య ౧ కి ౦-౪-౦ లు. ఇక ౨౫౦౦౧ లకన్న ఆదాయము తక్కువయున్న రు ౧ కి ౦-౨-౦. స్వామ్య, వ్యవస్థహక్కులక్రింద ఇవ్వబడును.

ఇదేసందర్భమున ౧౯ జేహాజు ౧౩౫౪ రోజు ఈక్రిందివిధముగా ఫర్మాను నివ్వబడినది.

గస్తీనె॥ ౧౦ ౧౩౩౯ ప్రకారము. జాగీరుయొక్క నికరాదాయమునుండి స్వామ్య. వ్యవస్థహక్కులను మొదలు తీయవలెను. తర్వాత ప్రభుత్వఅప్పులకిస్తులు చెల్లించి మిగిలినది వారసులలో పంచివేయవలెను.

మొత్తానికి జాగీరుయజమాని వ్యక్తిత్వము, హోదానిల్పుటకు కొన్నికారణములవల్ల అవసరమైయున్నది.

---

## నిర్మాణములు

హైద్రా. ౨౫ అమ.

ప్రభువుగారి ఫర్మానునుసరించి. మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహాదరుగారి అజ్ఞానుసారం, ఇందూరు [నిజామాబాద] మండలములోనిభోదను తాలూకాన్యాయస్థాన గృహనిర్మాణార్థము ౩౯ వేలును. బోధనతహసీల్దారునివాస గృహనిర్మాణమునకు ౫ వేలును మంజూరుచేయబడెను.

---

హైద్రాబాదు ౨౪ అమర్దాదు

మహారాజా సర్. కిషన్ ప్రసాద బహాదరుగారి అజ్ఞానుసారం, ఔరంగాబాద సుబా న్యాయమూర్తిగారి నివాసగృహ నిర్మాణమునకై ౨౧ వేలు మంజూరి చేయబడినది.

---

# బజారు ధరలు దద్దువైరామనగారు

(హైద్రాబాదు ఉస్మాన్‌గంజ్)

౨౬-౯-౧౩౪౯ ఫ. బుధవారము

| | | | |
|---|---|---|---|
| | | పల్లా 1కి రు. అ. పై | |
| బన్సి గోధుమలు | | ,, | ౧౭-౧౯ |
| గోధుమలు కెలాల్య మొ॥ | | ,, | ౧౩-౧౪ |
| బియ్యముదొడ్డువి క్రొ॥ మొ॥ | | ,, | ౧౦౫-౧౩ |
| ,, నానకురాంలు క్రొత్తవి | | ,, | ౧౩౫-౧౪ |
| ,, నానకరాంలు పాతవి | | ,, | ౧౬-౧౭ |
| ,, కొశిపిచోడీలు | | ,, | ౧౬౫-౧౭౫ |
| ,, క్రిచిసాంబారులుకొత్తవి | | ,, | ౧౬-౧౬ |
| ,, రామసాగరాలుకొత్తవి | | ,, | ౧౪-౧౪౬ |
| ,, డిటో పా॥ | | ,, | ౧౪౫-౧౪౫ |
| ,, పిచోడీలు | | ,, | ౧౭౫-౨౭౫ |
| ,, అమర్ సర్ సన్నబియ్యం | | ,, | ౩౨-౩౬ |
| ,, మోతిచూరు బియ్యం | | ,, | ౩౪-౩౫ |
| కందులు | పెద్దవి | ,, | ౯-౯౧ |
| కందిపప్పు | పెద్దది | ,, | ౧౩౫-౧౩౫ |
| పచ్చపెసలు | | ,, | ౯౫-౧౦ |
| పెసరపప్పు | | ,, | ౧౬-౧౬౧ |
| నల్లపెసలు | | ,, | ౭-౭౧ |
| మినుములు | | ,, | ౯-౯౧ |
| మినప పప్పు | | ,, | ౧౪౫-౧౫ |
| ఉలవలు | | ,, | ౬౫-౭ |
| జొన్నలు | | ,, | ౯౧-౧౦ |
| శిరి సెనగలు | | ,, | ౧౨౧-౧౨౫ |
| సెనగలు | కొత్తవి | ,, | ౧౦౫-౧౬ |
| పుప్పు | | ,, | ౧౨-౧౨౧ |
| శవుడు | | ,, | ౨-౨౫ |
| పల్లిగింజలు | | ,, | ౬-౭ |
| ఆలచందలు | | ,, | ౯-౯౫ |
| అనుములు | | ,, | ౬౫-౭౧ |
| బటానాలు | | ,, | ౭౧-౭౫ |
| తెల్లనువ్వులు | | ,, | ౨౦-౨౪ |
| బెల్లము | | ,, | ౧౦-౧౩౫ |
| ఎఱ్ఱ చక్కెర | | .. | ౧౪-౧౬ |
| తెల్ల చక్కెర | | .. | ౧౦౫-౧౨ |
| వేరుసెనగ | చిన్నవి | ,, | ౧౭-౧౭ |
| పసుపు | | . | ౧౧-౧౨ |
| మిరప కాయలు | | .. | ౧౬-౨౦ |
| చింతపండు క్రొ॥ మొ॥ | | .. | ౨౦౧-౨౦౫ |
| అల్లం | 12 సేర్లకు మొదలు | | ౩౫-౪ |
| శొంఠి | 40 సేర్లకు | | ౪౧-౪౨ |
| వుల్లిగడ్డ | పల్లా1కి | | ౫౫-౫౫౬ |
| యెల్లిగడ్డ | | ,, | – |
| వేరుసెనగనూనె | 12 సే॥ | | ౪౬-౪౧ |
| చింతపండు పాతది | | | ౧౨-౧౩ |
| కుసుములు | | | ౧౦-౧౦౧ |
| గడ్డినువ్వులు | | | ౧౨-౧౩ |
| తైదలు | పల్లా ౧ కి | | ౮౫-౭౧ |
| లంకలు | | | ౯౬-౯౧ |
| లంకపప్పు | | | ౧౧-౧౦౫ |
| లంకపిండి | | | ౧౦౫-౧౧౫౬ |
| ధనియాలు | మంకితేం౧౬ | | ౧౫-౧౫ |
| మెంతులు | మం॥ | | ౨౧-౨౫ |
| సోంపు | శే॥ ౪౦ | | ౯౫-౧౦ |
| ఆముదాలు | | | ౧౪౫-౧౫ |
| కొర్రలు తెల్లవి | | ,, | ౯-౧౦ |
| సోమ | | ,, | ౧౭-౧౫ |
| ఆవాలు | | ,, | – ౨౧ |
| వెండి | ౧౦౦ తు॥ | | ౫౭౫-౫౯ |
| బంగారము | తుం౧కి | | ౪౧౫-౪౧౫ |
| సవరను | | ,, | ౨౬౫ |

---




# గోలకొండ పత్రిక

ధాత నామ సం॥ ఆషాఢశు॥ ౧౩

గురువారము


## ద్వితీయ నిజాంరాష్ట్ర మున్నూరుకాపు మహాసభ

ద్వితీయనిజాంరాష్ట్ర మున్నూరుకాపుమహాసభ శుభముగాను సంతోషముగాను ముగిసినందుకు దాని సమావేశకులను అభినందించుచున్నాము మొదటి మహాసభవలెనే నిదియు కొందరు కులసోదరుల ప్రతికూలఘోషలచే కల్పితమైన నిరుత్సాహవాతావరణముమధ్య జరుగవలసివచ్చినది ఈసభకు ప్రతికూలురైనవారలు ఈమహాసభవలన వృధావ్యయముదప్ప మఱియేలాభముగాని లేదనిదూషించు కరపత్రములను ముద్రించి అంతటనుపంచి, తమవైరమును ప్రకటించినారు అట్టి కరపత్రములు మూడు మాకుపంపఒడినవి ఆహ్వానసంఘమువారు వీటికన్నిటికి నొక్కసారి సమాధానమును ౨౧ జూను ౧౯౩౬ నాటిప్రకటనలో ఇచ్చుచు, తమకు సంఘాభివృద్ధి చింతనదప్ప వేరొకయుద్దేశ్యము లేనేలేదనియు, తమ ప్రతికూలపక్షము వారినిగూడ ఈసభకు తాము ఆహ్వానించుచున్నామనియును చెప్పిరి ఇంతకు ఈవైరమంతయు సభను ఏపేరుతో జరుపవలెనను విషయమున ఏర్పడిన భేదములవలననే మహాసభ జరుపుటకుముందు ఒకటి రెండుసార్లు కాపుసంఘమువారలను, మున్నీరుకాపు సంఘమువారలను, మున్నూరుకాపు సంఘమువారలను వకాభిప్రాయమునకు దెచ్చుటకై రెండు మూడుయత్నములు చేయబడినవికాని అన్నియు విఫలములైనవి తుదకు మాకే విసుగుపుట్టి, మహాసభ జరుపుటవలన ఆకులములో ఇపుడేర్పడయున్న భేదములు వ్రేళ్లు నాటుకొని స్థిరములగునట్లున్నచో- మహాసభను జరుపకుండుటయే క్షేమమనితలచితిమి ఇంతకును ఈకులసోదరులకు ప్రత్యేకముగు సమస్యలు మొత్తముపై ఆంధ్రులకందరికిని సమానములుకానివి ఏవిగలవు? ఏవియులేనప్పుడు, ప్రత్యేకకులమహాసభయొక్క అవసరములేదుఅను వాదము మాకు విసుగుపుట్టిన అభిప్రాయమును ఒలపరచునట్లుండెను ఇంత నిరుత్సాహకరమగు వాతావరణములో ఓపికతో శాంతముతో మహాసభ జరిగియుండుట నిజముగా అభినందించదగిన విషయమే

ఈనిరుత్సాహపరిస్థితులలో బొంబాయిలో మంచిస్థితిలోనున్న కులసోదరప్రముఖులరాక సభాసమావేశకుల ఉత్సాహమును ఎక్కువగా నడకుండ కాపాడినది బొంబాయిసోదరులు ఈసభయందుచాల ఉత్సాహముతో పాల్గొని ప్రథమమహాసభకులేని ఒక క్రొత్తశోభనుకలిగించిరి

ఈసారి సభయందు గమనించదగిన ఒక ప్రశంసనీయమగు లక్షణమేమన, మొదటిమహాసభలో ఆమోదించబడిన ఒకతీర్మానము ప్రకారము మున్నూరుకాపుకులముయొక్క పేరు విషయమైన వివాదమును తేల్చుటకై మొదట ఒక ఉపసంఘము పేరుకు సంబంధించిన చరిత్రనంతయు సేకరించి స్థాయిసంఘమువారికి నివేదించినతర్వాత- స్థాయిసంఘమువారు ఆలోచించి, దానిపై తమకు తోచినపరిష్కారమును రెండవమహాసభలో ప్రవేశపెట్టవలసియుండ, అప్రయత్నమే యిపుడు కనిపించలేదు బహుశా భిన్నపక్షవాదులందరి సహకారమున్ననేగాని ఈవిషయమున నేమియు చేయవీలులేదని ప్రతినిధులందరును తలచియుందురేమో! ఎట్లైనను, భిన్నపక్షవాదులు ఈవిషయమునచర్చకువచ్చినను ఈచర్చలో కాలక్షేపము చేయకుండుటయే మేలని మాకనిపించినది ఏందువల్లననగా, ప్రత్యేకముగ పేరునుగూర్చి చర్చించునపుడు ప్రతిపక్షమువారును తమపట్టుదలలను వదలుట కిష్టపడరు కాబట్టి అట్టిచర్చనువదలి ముఖ్యవిషయములగు ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానికాది పరిస్థితులను బాగుపరచుకొను విషయమునుగూర్చి ఆలోచించుకొనుటయే వివేకము కనుక మొత్తమునకు రెండవమహాసభవారు చాల తెలివిగల పనిచేసినారు

ఒక విషయమునకుమాత్రము ఈ రెండవమున్నూరుమహాసభ ఒక స్థిరమైన నిర్మాణ కార్యక్రమమునకు పునాదివేసి మహాసభ వ్యర్థముగ జరుగలేదు అనిపించినది ఈమహాసభయందు మున్నూరుకాపుల విద్యాభివృద్ధికై ఒకనిధి స్థాపింపబడినది మొదటిదెబ్బకే ఒకకొన్ని నిమిషములకాలములోనే రూ౨౦౦౦ల వరకు విరాళములు లభించినవి ఈనిధిని విడువక పట్టుదలతో వృద్ధిచేయుచుండగలరనియు, ఇదియెవరికిగాని న్యాయముగ ఆక్షేపణలేనితీరున ప్రతిపైసకును జవాబుదారీతో యోగ్యులైన కులసోదరుల అభివృద్ధికై వినియోగించఒడునట్లు నిబంధనలు ఏర్పాట్లు చేయఒడగలవనియు ఆశించుచున్నాము ఈనిధి ఏర్పాటుచేయఒడినసమయములో సభాచర్యలను మాదువారలలో లేని ఆంధ్రమహాసభాధ్యక్షులు శ్రీయుత మాడపాటి హనుమంతరావుగారు మరుసటిరోజు సాయంకాలము మా ప్రతినిధివలన ఈ సంగతివిని ఇక ఈకులమువారలలో పేరువిషయమునగల వివాదములన్నియు త్వరలో సమసిపోవుననియు, ఏలననగా గట్టి నిర్మాణకార్యక్రమము ప్రారంభించబడినదిగాన అది దృష్టినిమరలించునని యునుడివిరి- వారివచనములు ఋషివచనములగుగాకయని భగవంతుని ప్రార్థించుచున్నాము.

---

మున్నూరుకాపు మహాసభ అహ్వాన సంఘాధ్యక్షులు



పొన్నాల రాజయ్యగారు

## మోతీమహల్ దురంతములు

స్వకీయ విలేఖరి

హైద్రాబాదు జూలై ౨౫

నిన్న వాయిదావేయఒడిన పోలీసువిచారణసంఘము నేడు ౧౦ గంటలకు సుల్తాన్బజారు హెడ్ పోలీసుస్టేషన్లో ప్రారంభమయ్యెను ప్రథమసాక్షి మోతీమహల్ టాకీసు వైర్మెనుఅగు లాజరుసు ఈతడు రెండుసంవత్సరములనుండి సెనిమాయందు పనిచేయుచున్నాననియు, నిత్యము సెనిమాప్రదర్శించబడునప్పుడెల్ల తాను సెనిమాకు వచ్చెడివాడననియు నుడివెను

సెనిమాకు ప్రమాదముజరిగిననాడు రెండుగంటలకు వచ్చినాను నేను ౬ గంటలకు లైట్లను వెలిగించితిని ౬-౩౦ గంటలకు మలిపితిని తర్వాత నేను మోటారు షెడుముందరగల చెట్టుక్రిందకూర్చొనియుంటిని నేనుప్రతినిత్యము అచటనే కూర్చుండెదను లోపలినుండి అగ్నిప్రమాదము, అగ్నిప్రమాదము అని కేకవినఒడినతోడనే సెనిమా అగ్నిప్రమాదమునకు లోనయ్యెనని తెలసికొంటిని తోడనే నేను మొదటిక్లాసునందేదేని ప్రమాదము జరిగియుండవచ్చునను భావముచే మెట్లపైనుండి అచటికిపోతిని నేనుపోవువరకు సెనిమాయందు పొగక్రమ్మికొనియుండెను నా కెటుపోవుటకును తోచకుండుటచే సెనిమా పైభాగమునకు వెడలితిని సెనిమాయందు కొందరు పార్సీ స్త్రీలు నాకగుపించిరి అచటినుండి నేను సమీపమునగల చెట్టుపయికి దూకవలయునను యుద్దేశముతో దుమికితిని క్రిందపడుటచే నేను తెలివితప్పి పడియుంటిని సుమారరగంట తరువాత నాకు బహిఃపరిజ్ఞానముకలిగెను ఒరు రూమునందు ఒల్బులు, చెక్కపెట్టెలుండును చెక్కపెట్టెలు తాళమువేయఒడియుండుటచే అందేమున్నది నాకు తెలియదు నేను సెనిమామిషన్ నడుపజాలను ప్రమాదముజరిగిననాడు నేను అపరేటరురూంలోకి వెడలలేదు డైనిమారూంలోనికి ఆట ప్రారంభముకాకపూర్వము డైనిమా స్టార్టుచేయుటకు వెడలితిని డైనిమాకేశవులుఆపెను అతడు నాకంటె పెద్దయుద్యోగి కేశవులు డైనిమా అపుటకుపోవుచుండుటచే నచటికి వెడలలేదు కేశవులు ౯ గంటలకు వచ్చెను సైకలుపైవచ్చి మోటారుగారేజియందు సైకిలునుంచి నావద్దనిలువఒడెను నాతో మాటలాడలేదు భగతును నేను అనాడుమాచితిని ఇద్దరు ఫైండర్లు పనిచేయుదురు పేరులు నాకు తెలియవు ఆనాడొక ఫైండరు నేనుచూచితిని

### నిప్పు చల్లార్చుటకు కేశవులు చేసిన ప్రయత్నము

తిరిగి రప్పింపబడిన లాజరుసు, ఇట్లు చెప్పెను -

"నేను చప్పుడైనపుడు గదిముందరి చెట్టుక్రింద కూర్చొనియుంటిని మొదటితరగతిలోనికి పోయి తంతెలపై నెక్కితి కాలిక్రింది నుండి పొగవచ్చుచుండెను క్రింద సామానుకొట్టయుండెను అక్కడ,విరిగిన వీపనలు, పెట్టెలు, కాల్చిన లాంపులు మొదలగునవి యుండెను రంధ్రముగుండా చూచితిని కాలుచున్నట్లు తలచితిని నేనక్కడ కొన్ని నిమిషములాగితిని మంటకొరడలు స్త్రీల వైపు వ్యాపించి పురుషులభాగమునకు గూడా వచ్చుచుండెను ఆంత అపరేటింగు కాబిన్లో కిపోగా అందు పొగనిండియుండెను అట నిలువలేక క్రిందికిరాగా మొదటితరగతినుండి కొడలువచ్చుచుండెను చేయునదేమియు లేక పైకిపోయి మదకు ఆఫీసు టీనురేకులపైనెక్కి క్రిందికిదుంకితిని అప్పుడు మూర్ఛవచ్చినది తెలివికిరాగా కేశవులు నన్నెత్తి హోటలు చేర్చిన సంగతి తెలిసినది అప్పుడు నేను కేశవులు ఇసుక దెచ్చుట, అతనితో బాలుడు బకెటువందించుట చూచితిని మేమిద్దరము మాట్లాడుచు బైటికివచ్చి మేనేజరుగదిపైని సీసపు విద్యుత్కాంతి కగుట చూచితిమి సామానుకొట్టునుండి కవచ్చెనని కేశవులు నాతో చెప్పెను గది ...కిపోయి సామానుకొట్టులోని అచట ఫిల్ములుపెట్టిన పెట్టె కాలు (బూడిదెను చూచి ఫిల్ముల గుర్తుపట్టెను లపెట్టె గదిమధ్యలోనుండుట పదిరోజుల జూచితిని కాని ఎవరుపెట్టినది తెల్యదు నిప్పుటుకొన్నపుడు ఆపరేటరునుజూడలేదు వీపనపడిపోయెనని నేను లోపలికి పోతిని, భగతునిప్పుచల్లార్చు యంత్రము తీసికపోవుట చూచితిని నా మొదటివాఙ్మూలము నిజమైనది గాదు ఎందుకన నేనపుడు మంచిస్థితిలో లేకుంటిని ఆరుగంటలకు అపరేటరును, అతని సహాయుని కేబిన్లో చూచితిని ఆనాటి విచారణ సంఘ కార్యక్రమము ముగిసెను

---

### దొంగనోట్లు చేసినవారు రిమాండులో

హైద్రాబాదు ౨౫ అమర్దాదు

౨౫ అమర్దాదురోజు నగరరక్షక శాఖవారు, రాజమలిపాగు, దేవకీనందన్, మరియు కిషన్లాల్ నేరస్థులను, దువ్వం నాజంగారిఇజ్లాసులో ప్రవేశపెట్టుచు, యజ్ఞనారాయణ, హనుమంతరావు వరదరాజులుయను నేరస్థులను విచారణ సందర్భమున రక్షకశాఖవారు మద్రాసుకు తీసికవెళ్లి తిరిగిరాలేదు గాన, ఇంకొన్ని దినములు నేరస్థులను రిమాండులో నుంచుటకు వేడగా, న్యాయమూర్తి ఇంకా ౫రోజులు రిమాండులోనుంచు యధికారము నిచ్చెను.

---

### క్రొత్త తెలుగు పత్రిక

ఇదివరకు సికింద్రాబాదునుండి దక్కన్ సరిఅను సగము ఇంగ్లీషు సగము తెలుగు పత్రిక వెలువడుచు ఒక సంవత్సరము నడచి నిలచిపోయెనుగదా! మరల ఇపుడు కొద్దికాలములో "౧౯౩౬"అను ఒక తెలుగు మాసపత్రిక అక్కడనుండియే వెడలనున్నది.

# చిన్న చిన్న దొంగతనములకు మరణదండన

౨౦౦ ఏండ్లక్రింద ఇంగ్లాండు దేశములో శిక్షలు

౧౮వ శతాబ్దిలోకూడ ఇంగ్లాండులో నేరములకు విధించబడు శిక్షలు ఈ ప్రపంచమందలి కొంతమంది అడవిజాతులలోవలె ఎట్లుచాల క్రూరముగనుండెనో ఇప్పుడే ప్రకటించబడిన ఒక ఇంగ్లీషుగ్రంథములో తెలుపబడినది.

అందు ౧౭౮౪ మరియు ౧౭౮౯ సంవత్సరముల సమాచారములు వర్ణించబడినవి. కోర్టుచే యబడిన అభియోగములను చూచినచో ఆరోజులలో సాంఘికపరిస్థితులును, శాసనములకీయు గోచరించును. మరణదండన అధికముగా విధించ బడుచుండెను. చిన్నచిన్న నేరములకు కూడ ఆదేదండన విధించబడుచుండెను. చదువు గలవానికి మరణదండన ఒక్కొకతడవ మాఫీ చేయుచుండుట విచిత్రము.

### కొరడాదెబ్బలు, బల్లశిక్ష

శిక్షలు ఈక్రింద సంక్షేపముగ వర్ణించబడియున్నవి.

జవాబుచెప్పనందులకు మీద బరువుపెట్టబడినవారు......౩ గురు
ఉరితీయబడినవారు......౧౦౦ ,,
వాతలుపెట్టబడినవారు......౫౪ ,,
దొంగలుగా వాతలుపెట్టబడినవారు......౨ ,,
కొరడాదెబ్బలు కొట్టబడినవారు......౪౩ ,,
బల్లశిక్ష వేయబడినవారు......౨ ,,
జెండకొయ్య విధించబడినవారు......౪ ,,
ద్వీపాంతరవాసశిక్ష......౧౮ ,,
రాజ్యభ్రష్టులు......౮ ,,
ఖైదుశిక్ష......౩౮ ,,
భరింపరానిపని......౮ ,,
…భ్రష్టులు......౨ ,,
…రమున కైశిక్ష......౧ ,,

…ము చేసినవారలు. నేరము మోపబడి …ధానము చెప్పక నోరుమూసికొని …అతనిని వెలకిలపండబెట్టి అతడు …వరకు, జవాబుచెప్పనే చెప్పనిచో …నంతవరకు అతనిపై రాతినిగాని, ఇను…ముగాని బరువుగా పెట్టుదురు.

…౧౦౦ మందికి ఉరిశిక్ష విధించబడినదికదా! వారలలో ౩౫ మంది బందిపోటుదొంగలు లేక రాత్రివేళల ఇండ్లకు కన్నములువేసినవారలు, ౬ గురు పందులను గొఱ్ఱెలను దొంగలించినవారలు, నలుగురుమాత్రమే హత్యచేసినవారలు, ఇద్దరు మంత్రములు పెట్టినవారలు, ౧౨ మంది బాటసారులనుకొట్టి బ్రతుకుచుండినవారలును మాటిలదొంగలును, ౨౩ మందిసామాన్యమైనదొంగతనము చేసినవారలు—ఇదివారలపై మోపబడిన నేరముల వివరణము. శిక్షితులలో నలుగురు బెర్ముడాస్‌కును, ఒకరువెస్టిండీస్‌కును పంపివేయబడిరి. ఏడుగురికిమాత్రము శిక్ష నిలుపుదల చేయబడెను. బైబిలులో కొన్ని వాక్యములు చదివి ఉరిశిక్ష తప్పించుకొనినవారలలో ౨౬ మందిపై సామాన్యమైన దొంగతనముచేసినట్లు నేరము మోపబడెను. ౧౦ మందిపై ఇండ్లకు కన్నము వేసిరను నేరమున్ను, ౧౨ మందిపై గొఱ్ఱెలను దొంగలించిరను నేరమున్ను, అయిదుగురిపై అడవిపందులను పశువులను దొంగలించిరను నేరమున్ను ముగ్గురిపై బరువులను ఎత్తినట్టియు దించునట్టియు ఒకయంత్రమునకుండిన పగ్గమును దొంగలించిరను నేరమున్ను, ఒకరిపైన రహత్యయను నేరము మోపబడినవి. కొందరు మతపురోహితులమని వాదించిరిగాని లాభము లేదయ్యెను. ౧౬ మంది చదువలేనివారగుటచే ఉరిదీయబడిరి.

ఒక స్త్రీ మూడేండ్లబిడ్డపై మంత్రప్రయోగములు చేయగా, ఆబిడ్డకు పెద్దజాడ్యమువచ్చి, అతడు మరణించెను అను నేరమునకై ఒక స్త్రీ ఉరిదీయబడెను. ఇంకొక స్త్రీ ఒకానొకపురుషునిపై మంత్రప్రయోగము చేయగా, ఆపురుషుడు దినదినము క్షీణించుచు జీవించలేనిస్థితికి వచ్చెనట ఆకారణముచే ఆ స్త్రీ ఉరిదీయబడెను. ఇదే స్త్రీ మరియొక పురుషునిపైనను అతని ఇద్దరుకూతుండ్రపైనను మంత్రప్రయోగము చేయగా, ఆముగ్గురును కృశించి కృశించి మరణించిరట.

కొరడాదెబ్బలు చాలచురుకుగా నుండెడివి. నెత్తురు కారునంతవరకు దెబ్బలుకొట్టబడుచుండెడివి. ఇరుగుపొరుగు వారలను శాంతముగనుండనీయని ఒకగయ్యాళికి కకింగ్‌స్టూల్ శిక్ష విధించబడెను.

# ఈసంవత్సరము మితిమీరిన వర్షములు

బొంబాయి ౨౮-౬-౪౦

గడచిన కొద్దిరోజులనుండి బొంబాయిలో అపరిమితవర్షములు కురియుచున్నవి. దీనికికారణము మధ్య హిందూదేశపు పశ్చిమభాగమున బంగాళాఖాతముయొక్క శిరోభాగమున కలిగిన వర్షపు పద్ధతియే యీప్రకారము యింకొ రెండుమూడు రోజులువుండునని తోచుచున్నది. కారణమేమనగా ఆనడి వాయవ్యమూలగా కొద్దికొద్దిగా జరుగుచున్నదని తెలియుచున్నది. యీనెల మొదలు కొలబా అబ్జర్వేటరీ లెక్కప్రకారము ౨౪.౫౫ అంగుళముల వర్షము కురిసినది. అనగా మామూలుకంటె ౧౦.౬౮ అంగుళములు యెక్కువకురిసినది ఉష్ణముకూడ మామూలుగా వుండవలసిన ౮౫ డిగ్రీలకంటె ౪ డిగ్రీలనుండి ౧౮ డిగ్రీలవరకు తగ్గిపోయినది యీరోజు రాత్రి ౮ గంటలవరకు అయిన ౨౪ గంటలలో సుమారు ౩ అంగుళములు కురిసినది.

### ఆగ్రా ప్రాంతములు నాగపూరు ప్రాంతములు కొంకణము మలబారులలో గొప్పముసురు వర్షము

యీక్రింది ప్రదేశములలో వర్షపు పరిమాణముల వివరములు

ఢిల్లీ ౯ అంగుళములు ఆగ్రా ౪ అంగుళములు మీరట్ ౫ అంగుళములు మహాబలేశ్వరము ౮ అంగుళములు వ్యజాలదిన్ని బాలసూరు, మసూరి, ఖండాలవగైరాలలో ౩ అంగుళములు సిమ్లా. ఉద్యానా. బొంబయి బెంగాలలో ౨ అంగుళములు.

### ఢిల్లీయొక్క ప్రత్యేక వర్షవర్తమానము మింటోబ్రిడ్జిపైన ౨౦ అడుగులు నీరువచ్చుట

### షాహజహాను చక్రవర్తియొక్క గోడలు పగులుచూపుట

నిన్న ఉదయము కురిసిన అపరిమితవర్షము కాక రాత్రివ్రాట ౯ అంగుళములు వర్షముకురిసి మొత్తము ౧౩.౫ అంగుళములు అయినది. అనగా మామూలువర్షమానముకంటె ౧౬.౪ అంగుళముల వర్షము యెక్కువకురిసినది. రెండు డిల్లీలు అనగా పాతకొత్త డిల్లీలు వరదలతో నిండిపోయినవి యిపుడు మింటోబ్రిడ్జిపైన ౨౦ అడుగులు నీరు నిలుచవున్నట్లు తెలియుచున్నది. కొన్నిగుడిసెలు మట్టియిండ్లు కూలిపోయినవి. ప్రజలు బయలునందు బహుకష్టతరముగా కాలము గడపిరి. కొన్నిచోట్ల షాజహానుకోటగోడలుపగిలినవి. కొంతమంది మనుష్యులకు దెబ్బలుతగిలినవి గాని మరణించినవార్తలేమియు లేవు యిందు వర్షముయెక్కువగునని నమ్మబడుచున్నది.

### రాబోవు సూచనలు

ఓఢ్రదేశము చోట నాగపూరు సెంట్రలు యిండియా తూర్పుభాగము, బొంబయి కొంకణము పంజాబు తూర్పుభాగము, బెంగాలు దేశములలో వర్షములు తగ్గగలవు

పంజాబు ఉత్తరభాగము సెంట్రలు యిండియా పశ్చిమభాగము, మలబారులలో యింకను అధికముగా వర్షించును.

# హైద్రాబాద విద్యాభివృద్ధి

ప్రభుత్వ ప్రకటన శాఖనుండి, హైద్రాబాద సంస్థాన కార్యాలయమునుండి ౧౫ అమర్దాదు ౧౩౪౯ ఫ … ప్రకటన జారీ చేయబడినది.

“౩౦ సంవత్సరముల ప్రారంభమున, హైద్రాబాదు విద్యా సౌకర్యములు కల్పించుటలో చాల వెనుకబడియుండెను. రెండు కళాశాలలు, అందొకటి ఇంగ్లీషునకు, ఇంకొకటి ప్రాచ్య విద్యలకై యుండెను. అవియు ఆనాటి విశ్వవిద్యాలయములకు జోడింపబడి యుండెను. ప్రవేశపు లెక్కించునన్ని మాత్రమే పాఠశాలలుండెను. సాంకేతిక, వృత్తివిద్యలకై ప్రత్యేకమైన పాఠశాలలు లేకుండెను.

ఈ ముప్పదిఏండ్లలో, (అందధికభాగము ప్రభువుగారి పరిపాలనా కాలము) పాఠశాలల, కళాశాలలసంఖ్య పెరిగినది. విద్యార్థుల విద్యాగ్రహణసంఖ్య హెచ్చినది.

ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నతవిద్యవ్యాప్తి, ఈడుపొందిన వారికి హరిజనులకు పాఠశాలలు పారిశ్రామిక విద్యగరుపువ్యవస్థలు అన్నిటికన్న, ఒక క్రొత్త విశ్వవిద్యాలయ స్థాపనము విద్యాభివృద్ధియొక్క నిదర్శనములు.

ప్రాథమికవిద్య సార్వజనికమును ఉచితమును చేయబడినది. అంత ప్రతిబాలుడు లాభముపొందవచ్చును. రాజ్యములో ముఖ్యముగా వాడబడుచున్నవి నాలుగుభాషలు. ప్రతిచోట అందరి అందుబాటులోనుండుటకు ఒకటికన్న ఎక్కువ పాఠశాలలు నెలకొల్పబడెను. ప్రాథమిక పాఠశాలలతోబాటు మాధ్యమిక పాఠశాలలుగూడా విరివిగా నెలకొల్పబడినవి. ఏపెద్ద పట్టణముగూడ పాఠశాలలేక లేదు. అదిగాక, ఎన్నియో ఉన్నతపాఠశాలలు నెలకొల్పబడెను పాతపాఠశాలలలో గట్టివ్యవస్థ చేయబడెను. ఇందుకొన్ని పాఠశాలలందును, ఒక కళాశాలయందును, ఇంగ్లీషు విద్యావిధానము ఎప్పటివలెనున్నది. కాని ఉస్మానియా ఉన్నతపాఠశాలలలోను. కళాశాలలలోను ఉర్దులోనె విద్య గరుపబడును. అదిగాక, కొన్ని ప్రత్యేకసంస్థలు గూడాగలవు. ఉదా:- హరిజన పాఠశాలలు, ఈడుపైబడినవారి స్కూలులు, సాంకేతిక పాఠశాల, జాగీర్దారుల కళాశాల. దేహపరిశ్రమ, శాసనము, వైద్యము. ఇంజనీరింగులకై కళాశాలలు. ఈసౌకర్యములనుబట్టి, వేరేచోటినుండి వైద్యులను. న్యాయవాదులను, ఇంజనీరులను పిలుపించుకొను అవసరము కలుగుటలేదు.

ఈఅభివృద్ధి బాలురవరకేగాక, అందు బాలికలుగూడా భాగస్థులైయున్నారు. ఈక్రింది అంకెలవల్ల స్త్రీవిద్యాభివృద్ధి తేటపడగలదు.

నేటికి ౨౫ ఏండ్లకుముందు ౮౦ ప్రాథమిక, ౧౦ మాధ్యమిక పాఠశాలలుండెను. ఉపాధ్యాయినుల శిక్షణ వ్యవస్థలేకుండెను. నేడో ౬౪౪ ప్రాథమిక, ౨౮ మాధ్యమిక పాఠశాలలున్నవి. ౪ ఉపాధ్యాయినుల శిక్షణాశ్రమములు, ౪ ప్రత్యేక పాఠశాలలున్నవి. ఈ అన్నిటిలోను పర్దా వ్యవస్థ చక్కగానున్నది.

అజ్ఞానము (వ్రాయ చదువరాకుండుట) పోవుట విద్యావ్యవస్థపై నాధారపడియున్నది. కాన, జిల్లాలలో, నగరములో ఈడుపొందిన వారికై ౪౫ పాఠశాలలున్నవి. ఇందు ౧౫౩౧ గురు విద్య నభ్యసించుచున్నారు.

ఇక హరిజనుల దుస్థితిబాపుటకు, ప్రత్యేక పాఠశాలలు ౧౦౦ నెలకొల్పబడెను. అందు ౪ వేలవిద్యార్థులున్నారు. వీనికొన్ని ఖాన్గిపాఠశాలలు, సహాయపాఠశాలలుగా మార్చబడెను.

ఈ ౨౫ ఏండ్ల ఎడతెగని ప్రయత్నఫలితముగా ౧౦౦౦ పోయి ౫౦౦౦ పాఠశాలలైనవి. ౬౬౦౦౦ లుపోయి ౩ లక్షల ౫౦ వేల విద్యార్థులైరి. ౧౩ లక్షలుపోయి ఒకకోటి రూపాయలకన్న ఎక్కువవ్యయపరుప బడుచున్నది.

ఈసందర్భమున, సంస్థానపు ఆర్థికస్థితిగతులనుబట్టి, ప్రస్తుతవిద్యావిధానము మార్చవలసివచ్చెను.

విద్యావ్యవస్థ సంఘముయొక్క ఉపసంఘము నియమించెను, అందు ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రొవైసు-చాన్సలర్, విద్యాశాఖ నాజంగారలుండిరి.

సంస్థానములోనిముఖ్యమైనవిద్యాసమస్యల విషయమై ప్రజాభిప్రాయము పొందుటకు ఉపసంఘము ౨౦౦ మందిని ప్రభుత్వమువారలు ఇతరులను సాక్షులను విచారించిరి. ౫౦ కన్న ఎక్కుడు సాక్షులవాఙ్మూలములు … కొనబడెను. వానిగూర్చిచక్కగావిచారించి, సంఘము తనరిపోర్టును మంజూరుకై ప్రభుత్వమువారికర్పించుకొన్నది. అట్టితరి విద్యావిధానమార్పునుగూర్చి చెప్పుట అసమంజసము.

ఐనా ప్రస్తుతస్థితిగతులను పరిశీలించిన విద్యావంతులలోని నిరుద్యోగ సమస్యను పోగొట్టుటకు, పాఠ్యక్రమములో మార్పుగావించబడునని తేలుచున్నది.

విద్యావ్యాప్తి ప్రతివాని అవసరములు లక్ష్యములను బట్టియుండవలెననియే ప్రభుత్వాశయము. లేకున్న ప్రతివాడుసారస్వతమె నేర్చుకొనవలయునని ప్రతిబంధకముంచిన, నిరుద్యోగుల పెంచుటకన్న ఎక్కువమునేమికాదు.”

# ప్రజాప్రాతినిధ్యములేని ప్రభుత్వమహాసభలు నిష్ఫలములు

నిజామాబాద.

వానకాలము మొదలైననుంచి వానకురియుచున్నది. ఇంతవరకు ౯ ఇంచుల వానకురిసినది. కాని రైతుల ఇక్కట్లు ౧౦౦కి ౯౧ వంతు ఎప్పటివలెనే యున్నవి.

వరంగల్లు సుబేదారుగారి అధ్యక్షతన, ౨౨ అమర్దాదు రోజు నిజామాబాదలో సుహాస్య రూపమున నొకకమిటి జరిగినది. అందు ఇతర భూమ్యాదాయ, అబుపాషి, పశువైద్య, వ్యవసాయ శాఖాధికారులు పాల్గొని యుండిరి, ఇందు నిజాంసాగరు సమస్యలుగూడ పెట్టబడినవి. సమస్యలు ఎక్కువగానున్నందున కమిటి రెండవరోజుకై వాయిదా వేయబడినది.

ఇట్టి కమిటీలలో రైతుల ప్రతినిధులరానిచ్చి వారిముఖతః రైతులఇక్కట్లులనువిని. వానినిపరిష్కరించిననేగాని, లాభముండదని పైయధికారులకు పెక్కుసార్లు విన్నవించుకొనబడెను.

నిజాంసాగరును విజయవంతము చేయుట రైతుల చేతులలోనున్నది, ఇక అందుకొరకై ఏర్పాటైన కమిటీలో ఉన్నతోద్యోగులు దక్క మరొకరుండక పోవుటచే, అందేయేవిషయములపై చర్చింప బడినది రైతులకు తెలియనే తెల్యదు. ఉదాహరణార్థము, చెరుకుపంటకు కలిగిన నష్టములనెట్లు పరిష్కరింపవలయును? ధర పడిపోయిన పంటనేమిచేయవలెను. పెంట ఎక్కడనుండి, ఎట్లుసమకూర్చవలయును?

ఒకప్పుడు, అవసరములందు నీరు అందకుండును. ఎకుఫసలా తాబీ కిస్తీలను, అబిలోతలుసుని నిర్బంధ పెట్టుటెంత వరకు చెల్లును, అదినియమానుసారమేనా? రేకళ్లనుతరీకొస్తు చేయుమనుట చెల్లునా? రవిజనులో ఎక్కువధారాలమైగమనింపబడినదా! అబీఫసలును, మొదటిఫసలని నిర్ణయించుటలోను, నిజామాబాదను మెదకునుండి తీసి వరంగల్లు సింతులో కలిపినందున, రైతులమొర పెట్టుకొనుటలోను ఎంతఆటంకము జరుగుచున్నది. ఇట్లుఎన్నియో విషయములున్నవి. వీటిపరిష్కరణ ఇట్టికమిటీలలో … జరుగగలదు. అందువల్లరైతులు అభియోగములు చెప్పుట స్వయముప్రయాసములకోర్చుట యెమియునుండక, రైతులు సుఖస్వప్నములుగాంచుచుందురు. కాన ప్రభుత్వమువారు ఈవిషయమున తీవ్రచర్యతీసికొని, రైతులనేమూతబడనీ దేశములో సుఖము నెలకొల్పవచ్చును.

ఇక్కడ నీటివసతి, మురికికాలువలనీక్కము ఆపివేయబడినందున, పురజనులు తహతహపెడుచున్నారు.

వైద్యాలయపు స్థితిబాగ యున్నది. [ఆపరేషన్] శస్త్రచికిత్స పరికరములు సేకరింపబడినవి. ప్రసవమందిరములోగూడా పరికరములు సేకరింపబడుచున్నవి. (ర. ద.)

# ఆంధ్రమండలపు మహాసభలు

[స్వకీయ విలేఖరి]

నర్సాపురము. —

పశ్చిమ గోదావరి మండ లాంధ్ర మహాసభ నర్సాపురంలో జూలై మధ్యభాగమున జరుగును శ్రీహట్టిశంకరరావుపంతులు [అనంతపురంజిల్లా ధర్మవరం] గారి యధ్యక్షులుగా నాహ్వానసంఘము వారు కోరిరి నూత్నముగ నెల్లూరు పురపాలక సంఘాధ్యక్షులుగా నెన్నుకోబడిన యువకుడు శ్రీ రెబాల లక్ష్మీనర్సారెడ్డిగారు సభా ప్రారంభకులుగా కోరబడిరి ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ చావలి యజ్ఞేశ్వర సోమయాజులు గారు సభ ఏర్పాటులవిషయమై శ్రద్ధగా పని చేయుచున్నారు

నెల్లూరు మండలాంధ్రమహాసభ నెల్లూరులో జరుపుటకు యత్నములు జరుగుచున్నవి కోలారు జిల్లాబోర్డు ప్రెసిడెంటు శ్రీ కె చంగల్వరాయరెడ్డి M L C గారధ్యక్షులుగను సేలం వాస్తవ్యులును, దక్షిణాంధ్రులలో సుప్రసిద్ధ నాయకులువగు డాక్టరు పి వరదరాజులు నాయుడుగారు సభా ప్రారంభము చేయగలరని తెలియుచున్నది

* * * *

ఆంధ్రరాష్ట్రపు నేత పనివాండ్ర మహాసభ తూర్పు గోదావరి జిల్లా పిఠాపురమున కొరు మైళ్లలోనున్న ఉప్పాడ గ్రామమున జూలై ౧౭ మరియు ౧౮ తేదీలలో జరుగును దక్షిణాంధ్ర నాయకులలో ప్రముఖులుగా నెన్నదగిన శ్రీ వి ఎం రామచంద్రచెట్టిగారు [జిల్లా విద్యాసంఘాధ్యక్షులు] అధ్యక్షతవహించెదరు ఎన్ జి రంగాగారు M L A సభా ప్రారంభకులు చెట్టిగారిని సభాపతులుగా ఆంధ్రమహాసభా కార్యదర్శి శ్రీయుత సుసర్ల శ్రీరామనృసింహం పంతులుగారు సూచనచేయగా ఆహ్వానసంఘమువారంగీకరించిరి ఈవిధముగ మైసూరు దక్షిణాంధ్రులను ఆంధ్ర రాష్ట్రీయులతో పరిచయము చేయుటకు ఆంధ్రమహాసభా కార్యదర్శిగారు పూనుకొన్నారు

# ఫ్రాన్సులో అముద్రిత సంస్కృత గ్రంథములు దొరకుట

ఇండియాకు తెప్పించుటకై బరోడా మహారాజుఖర్చు

ప్రపంచమత మహాసభకు పోవుటకై ఇంగ్లాండుకుపోయిన "కలకత్తా సంస్కృతకళాశాల" ప్రిన్సిపాలు డాక్టర్ సురేంద్రనాథదాసుగుప్తగారు మార్గమధ్యమున ప్యారిసులో "నేషనేల్ బిబ్లియోథెక్"లో కొన్ని విలువగల అముద్రిత సంస్కృతగ్రంథములను కనుగొనిరి ఆగ్రంథములను ఫోటోగ్రాఫు తీసికొని, భారతదేశమునకు చేర్చుటకగు ఖర్చులన్నిటిని భరించుటకు బరోడామహారాజుగారు సంసిద్ధులైనారు ఈగ్రంథములలో ఆయుర్వేదము, వేదాంతముననుగూర్చిన గ్రంథములుగలవు వీటిని "ఫ్రెంచిరెవొల్యూషను' కు పూర్వమే ఫ్రెంచిపండితులు ఇండియాలోనుండి తీసికొని పోయియుండిరి

# బ్రిటిషుసామ్రాజ్యమును జోడించినవాడు

గాంధిమహాత్మునిగూర్చి బ్రిటిషుప్రముఖుని అభిప్రాయము

గాంధిమహాత్ముడు ప్రపంచమునచాలబలవంతమగు సామ్రాజ్యమును ఓడించుటయందు చాలమట్టుకు జయించుటయేగాక వారిఅనుచరులు వారుచెప్పినట్లు విననందువలనమాత్రమే తుదకుఓడిరి. అనగా ఈఓటమిని తప్పించుటకు సాధ్యముగాకపోదు" అని కెప్టెనుముంఫర్డు అను బ్రిటిషుప్రముఖుడు "హ్యూమానిటీ, ఏర్‌పవర్ అండ్ వార్" అను దానిలో వ్రాసినాడు

# మనుష్యునివలె ఏడ్చిన మామిడిచెట్టు

ముజఫర్పూరులో గోరక్షిణి సమీపమున నొక మామిడిచెట్టు ఒకనాటి అర్ధరాత్రివేళ మనుష్యునివలె ఏడుపసాగినదట ఈఏడ్పుశబ్దము విని అనేకజనులు అచటికివచ్చి నిలువబడిరి అచెట్టులో ఒకకొమ్మను విరుగగొట్టునంతవరకు ఆశబ్దము వచ్చుచుండెనట దీనికి కారణమేమో ఇంతవరకును ఎవరును చెప్పజాలకున్నారు గాని జనులుమాత్రము అధికముగా చూడబోవుచున్నారు

# సమాధిలో సజీవుడుగ కొన్నిరోజులవరకు ఉండుట

రాజయోగ ప్రభావము

ఖుదాబక్సుఅను నతడు ఇదివరలో కండ్లకుగట్టిగా గంతలుగట్టియున్నప్పుడు గూడు బైటనున్న వస్తువులనన్నిటిని చూడగల్గుచు బ్రిటిషుసైంటిస్టులచే "యక్సరే" కండ్లుగలవాడనుపేరు పొందియుండెను తర్వాత విషమును, ప్రస్సిక్ ఆసిడ్ నుత్రాగినను ఎట్టిబాధను అనుభవించక సుఖముగానుండి సైంటిస్టులకు ఆశ్చర్యముకలిగించెను తర్వాత అతడు నిప్పులలో సుఖముగానడచి ఆశ్చర్యముకలిగించెను

ఇప్పుడతడు గుండెను పనిచేయకుండనాపి, కొన్నిరోజులు సమాధిలోనుండి సజీవుడుగ పైకివత్తుననుచున్నాడు ఈశక్తిని పరీక్షించుటకు లండనులో మానసశక్తి పరిశోధనసంస్థ (ఇన్స్టిట్యూట్ ఆఫ్ సైకికల్ రీసర్చి) వారుఏర్పాట్లు చేయుచున్నారు శరీరము భూమిలోపూడ్చిపెట్టుటకుముందు ఖుదాబక్సుగుండెను పనిచేయకుండ ఆపివేయునట ఊపిరికూడ ఆగదట ఏడాక్టరైనను అప్పుడుపరీక్షించి అతడుచచ్చినట్లే చెప్పగలడు కాని వాస్తవముగ తాను తనఆత్మను శరీరమునుండి తీసివేసి మనస్సులో చేర్చెదననియు, సమాధిలోనున్నంతకాలము ఇక్కై యుందుననియు భూమిపైకివచ్చినతర్వాత మరలగుండెనని యథాప్రకారము చేయింతుననియు ఖుదాబక్సుచెప్పుచున్నాడు

ఈశక్తిలో విచిత్రమేమియులేదనియు రాజయోగమునందు విశ్వాసముగలిగి అదితెలిసినవానికి ఇది సామాన్యవిషయమేయనియు ఖుదాబక్సుగారు చెప్పుచున్నారు తానింతవరకు చేసిన ప్రదర్శనములన్నియు రాజయోగ ప్రభావములేనట కండ్లకు గంతకట్టినప్పుడు తాను రాజయోగవిధానముచే మనస్సంకల్పబలము నుపయోగించి ఇతర అవయవములకు ఉదాహరణార్థము చెవులకు, ముక్కునకు చూచుశక్తిని కల్పించి చూడగలుగుచున్నాడట ఆసంకల్పబలముచేతనే ఎటువంటివిషమునకైనను లొంగక వజ్రకాయముగ తనదేహమును చేసికొనుచున్నాడట నిప్పులలోనడచునపుడుకూడ ఆసంకల్పబలమే అతనిమనస్సుకుగాని శరీరమునకుగాని బాధకలుగకుండ చేసినదట రాజయోగ ప్రభావము అటువంటిది

## తుంగభద్రా ప్రాజెక్టును గూర్చి సిమ్లాలో సభ

ఇండియా ప్రభుత్వపు వాణిజ్యాంగశాఖ మంత్రియగు సర్ ఫ్రాంకునాయిస్‌గారు మద్రాసు, బొంబాయి, హైదరాబాదు (దక్కన్) మైసూరు ప్రభుత్వముల ప్రతినిధులనుపిలిచి ఈ ప్రాజెక్టు నిర్మాణవిషయమున వచ్చిన వివాదమును పరిష్కరించుటకై ఒకసభ జరుపుదురని హిందూపత్రికయొక్క సిమ్లా విలేఖరికి తెలియుచున్నది వివిధప్రభుత్వములు ఈ ప్రాజెక్టుకై యెంతఖర్చుపెట్టిన ఏంత లాభము పొందగలుగునో వివరములన్నియు అపుడు సమన్వయము చేయబడును

## మహమ్మదుప్రవక్తవంశము

—

ఆగాఖాను కుమారుని పాశ్చాత్య వివాహము

—

లండను, జూను౧౭:—

మహమ్మదు ప్రవక్తయొక్క సొంతకుటుంబములోని ౪౯వ వారసుడగు ఆగాఖాను, లాంక్షల మహమ్మదీయుల మతగురువు అన్యజాతి స్త్రీని వివాహమాడుటవలన, వారివంశము పాశ్చాత్యజాతిలో కలసిపోవుచున్నది. ౧౯౦౮ సం॥ వంశములోకెల్ల మొదటిసారి ఆగాఖానుగారు తనజాతినివిడిచి అన్యజాతియగు ఇటలీదేశపు రాకుమార్తెను ప్రిన్సెసు తెర్సాను వివాహమాడెను. వారిపుత్రుడగు ఆలీఖాను ముందు మతగురువు కానున్నాడు. ఈతడు సగము భారతీయుడు సగము ఇటలీ దేశీయుడు. క్రిందటినెల యీ ఆలీఖాను గౌ. లియలుగిన్నెసు సతియను కీ. శే. చర్లెసను ప్రభుని కూతురిని. ఆంగ్లేయ కన్యను వివాహమాడెను. అందుచే ఆలీఖానుపుత్రుడు ముప్పాతికవంతు యూరోపియను,పాతికవంతు ప్రాచీనజాతివాడగును” అని సండేధరి పత్రిక వ్రాయుచు, మహమ్మదుప్రవక్త వంశమువారు యూరోపియను లగుచున్నారనెను.

ఇందువలన ఇస్మేలి మహమ్మదీయుల వంశపారంపర్యపు హక్కులగు గురుత్వమేమగును. విదేశపురక్తము కలసినవానిని తమ మతగురువుగా అంగీకరింతురా? అంగీకరింతురు.

—

## అబిసీనియా యుద్ధానికై ఇటలీఖర్చు

—

...సీనియారాజ్యము సంపాదించుటకై ఇ... సెప్టంబరు నెలనుండి మొన్నటివ... ౧౫౦౦౦౦౦౦ డాలర్లను ఖర్చుచే... యించబడుచున్నది.

—

## పురుషులుగమారిన ఇరువురు బాలికలు

—

గతవారములో వెడలిన పత్రికలయందు ఇద్దరుబాలికలు పురుషులుగమారినట్లు వార్తలుగలవు. ఒకతెప్లిమత్‌లో ఓరెస్టనువాస్తవ్యురాలు క్రొత్తగామారిన పురుషులలో నొకరగు మార్కువెస్టక్ తనమార్పునుగూర్చి ఇట్లుచెప్పెను

“౧౯౨౫ నుండి నాకుస్త్రీగానుండుట ఏదోవిచిత్రముగా దోచసాగినది, నేనుగోలు గుకొనుచుతర్వాత తక్కనబాలికలవలె పౌడరును ఉపయోగించుచుండెడిదానను” వెస్టక్ రెండు ఆపరేషనులలో పూర్తిగాపురుషుడయ్యెను ఇంకొకపురుషునికి ఒక్కఆపరేషనే సంభవించెను జోలక్‌కుక్ అనుకన్య ఆపరేషనుకు ముందు ౨౭ ఏండ్లవయస్సుగలది ఆపరేషనుజరిగినతర్వాత అధమమువది ౧౦ యేండ్లవయస్సుగలదిగనైనను కనబడును ఇపుడామెకు మీసములువచ్చినవి ఇకగడ్డమురావలసియున్నది పురుషవేషమునే ధరించుచు సంతోషించుచున్నది

మేరీవెస్టక్ ౩౦ ఏండ్లవయస్సుగల బ్రిటిషుకుస్త్రీపట్లమొనగాడు ఆమెకు ...ప్పుడు చెలికత్తెగనున్న ఒకతె ఇప్పటికిని చెలికత్తెయే

...తేగాక జెకొస్లొవేకియాలో ఒకచాంపి... బాలికయగు మిల్‌టిడెంకొ గొల్‌కొ... ...మె ఇటీవలనే రెండు ఆపరేషన్లలో... ...పొంది ఆదేపేరును మగపేరుగామా...

—

## లండనులో హైందవ దేవాలయము

—

లండను: జూన్ ౧౯:

లండనులో హైందవ దేవాలయ నిర్మాణమునకు వివిధ భారతీసంఘములు సహాయమొనర్చుచు ప్రోత్సాహము నొసగుచున్నవి. ఆగస్టులోపుగ ఈఏర్పాటులు పూర్తియగుచో త్రిపురమహారాజు గారు దేవాలయస్థాపనమునకు శంఖుస్థాపనము గావించెదరు.

శ్రీమతులుండెడి మేఫెరులో స్థలమునుపరీక్షించుచున్నారు. ధర అనుకొన్నదానికి చాల ఎక్కువగా నుండుటచే ఆలోచించుచున్నారు. ఈదేవాలయ స్థాపనమునకు చేయూత నొసగుచున్న ఆంగ్లేయులు మెఫెరులోనే దేవాలయమును నిర్మించవలె ననుచున్నారు. ప్రభువులు తదితర శ్రీమంతులు మున్నగు ప్రముఖుల భవనములకు ఇది అనతిదూరములో నున్నది. హిందూమతము పట్ల అభిమానము కొందరు ధనికులగు ఆంగ్లేయులకు స్త్రీపురుషులకు ఏర్పడినది. వీరు సహాయమొనర్చెదరు. కాని అచట వసించువారలు మరికొందరు దేవాలయ నిర్మాణమునకు ఆక్షేపణలను జూపవచ్చును. అట్టి దేవాలయములందు జరిగెడి సంగీతమువారికి నిద్రపట్టుటకు వేకువజామున అభ్యంతరముగ నుండునని నెదరట.

—

## స్త్రీ మంగళ్లు

—

క్యాంటనులో స్త్రీలమంగళ్లు ౨౦౦౦ మంది ఉన్నారు వారలు పురుషులకంటె ఎక్కువ వ్యాపారము చేయగలుగుచున్నారు. కాని అక్కడి “జాతీయ ప్రభుత్వము” ఈ ఆచారమును రూపుమాపుటకు యత్నించుచున్నది. స్త్రీల మానమును నీతిని నిలుపుఉద్దేశ్యముతో స్థాపించబడిన సంఘములు అనేకములు ఈప్రభుత్వమువారి ఉద్యమమునకు తోడ్పడుచున్నవి.

—

## బొంబాయియందలి ఇటలీకౌన్సలు రోముకు పిలువబడుట

—

బొంబాయి: జూన్ ౨౪:—

వెంటనే రోమునగరమునకు ప్రయాణమైరావలయునని బొంబాయినందలి ఇటలీకాన్సలను ఇటలీ ప్రభుత్వమువారు తంతివార్త నంపియున్నారుగాని ఇందులకు కారణమేమో ఇంతవరకు తెలియకున్నది. అబిసీనియా విషయమై భారతదేశమున ప్రచారము సలిపెడి. కలకత్తాయందలి ఇటలీకౌన్సిలు జెనరలుగారు అప్రచారమునందు బొంబాయి కౌన్సలు ఎట్టిసంబంధము కలుగజేసి కొనవందున ఈప్రచారమునకును ఈ ఉత్తరువునకును ఎట్టిసంబంధములేదనిచెప్పవచ్చును. ఈసందర్భమున విదేశముల కౌన్సిలులు ఇట్టిప్రచారము సలుపవచ్చునాయను ప్రశ్న ఉదయించుచున్నది. కౌన్సిలున్నదేశమునకు ప్రతికూలమగు ప్రచారమునుమాత్రమే వారు జరుపకూడదు. ఇతర విషయములగు ప్రచారమునుసలుపుటను నిషేధించు సాంప్రదాయమేమియులేదు.

### అడిస్ అబాబాయందలి భారతీయులు

అడిస్‌అబాబ నగరమునందు ప్రస్తుత మెంతమంది భారతీయులున్నదియు. వారేమిపనులు చేయుచున్నదియు తెలుపవలయునని ఇండియాప్రభుత్వము అడిస్‌అబాబయందలి బ్రిటిషురాయబారిని కోరిరని తెలియుచున్నది.

### సిక్కులదళము

అడిస్‌అబాబయందలి సిక్కులసైనికదళమునుమరల దేశమునకు పంపువిషయమై బ్రిటిషుప్రభుత్వమువారింకను ఎట్టినిర్ణయము గావించుకొనలేదని తెలియుచున్నది. సమితిమహాసభవారు అబిసీనియా సమస్యగురించి నిర్ణయముగావించినపిమ్మట, ఆవిషయమై ప్రభుత్వమువారు ఆలోచించెదరు. సిక్కుదళమును తిరిగి భారతదేశమునకు పంపుటకు అనుకూలమగు శాంతిపరిస్థితులింకను అబిసీనియాలో ఏర్పడలేదనియే బ్రిటిషువారి అభిప్రాయమైయున్నది.

—

## రయితులకుకావలసినది అన్నము; రేడియోకాదు

—

కాంగ్రెసు అధ్యక్షునకు రయితుల విజ్ఞాపనము

లక్నో: జూను ౨౪:—

పండిత నెహ్రూగారు

కాంగ్రెసు మహాసభాధ్యక్షుడగు పండిత జవహర్లాల్ నెహ్రూగారు ఎన్నసనూరినుండి ప్రయాణమువచ్చిరి. రయితులక్షేమ కాంగ్రెసు మహాసభాధ్యక్షునకు విజ్ఞప్తిపత్రమునర్పింపబడెను. అవిజ్ఞప్తిపత్రములో రయితులయనేకకష్టములు వివరింపబడెను. భారమగుశిస్తులు, నీటిలోటుగలబుగుబోగు, అటవీశాసనములు, పశువులమేతకైపడుచున్న యిబ్బందులు. త్రోవలను పూడ్చుటచిన్న ఉద్యోగీయులచే కలిగింపబడుచున్న యిబ్బందులు విజ్ఞప్తిపత్రములో వివరింపబడెను. ఏదోఒక రకపు రేడియోఏర్పరుపబడెను. గాని తమకు కావలసినది రేడియోలు కాదనియు, అన్నమనియు రయితులు విజ్ఞప్తిపత్రములో తెలిపిరి.

రయితులు రాజ్యాధికారమును సంపాదింపగలిగినప్పుడె రయితులకష్టములు తీరు నవకాశముకలదనియు, స్వరాజ్యమనగా జనసామాన్యముయొక్క పంచాయతీరాజ్యముగా నుండవలెననియు పండితుడుచెప్పెను. కావునకాంగ్రెసువారు స్వరాజ్యము సంపాదించుటకుగాను రయితులు తోడ్పడవలెనని పండితుడు కోరెను.

—

## నాజీల జర్మనీకి గాడిదె నాయకులు

—

యూరోపాలో సామ్యవాదులు [సోషలిస్టులుఅను ఇంగ్లీషుమాటకు తెలుగు] జర్మనీలో ప్రభుత్వాధికారమునందున్న నాజీలను వెక్కిరించుకొనుటకై తమలోతాము చెప్పుకొను ఒకకథ చాల తమాషాగానున్నది.హాలెండులో ఒక ఆవు, ఒకకుక్క, ఒక గాడిదె నాజీల జర్మనీలో నెట్లుండునోయను ఆశ్చర్యముతో ప్రేరితములై ఒకదానితర్వాత నొకట చూడబోయెనట, మొదట ఆవుపోయి ఒకవారముతర్వాత తిరిగివచ్చి “ఛీ! ఇంత అన్యాయములేదు. అక్కడనీకు మేతవేయరుండా. రొంజంలేయు పితుకుదురు.“అని ఏడ్చెను.” తర్వాత కుక్కపోయిచూచి వచ్చి: “అబ్బో! అంతఘోరము మరెక్కడనులేదు. నీవు అక్కడ మొఱుగనే మొఱుగగూడదు. లేనిచో నాయనిన్ను చావదన్నెదరు” అని అనెను.పరె మనముపోయి చూచివత్తమని గాడిదెపోయెనేకాని మరల తిరిగిరాలేదు.” కొన్నాళ్లకు ఆవును. కుక్కయును, ఆగాడిదెను పరిహద్దుయొక్క అవలిప్రక్కనచూచి, హెచ్చరించి, ఎట్లున్నదని యడుగగా, ఆగాడిదె, “నారోజులు చాల బాగున్నవి. ననప్పుడే ఒకవర్గమునకు నాయకునిగ జేసినారు.” అనిచెప్పెను. ఇదికథ:

—

## భయము మూగతనమును పోగొట్టుట

క్వీన్సులో ఏన్లియనీలో రెటీ వాస్తవ్యుడగు నేమండు మెర్డొనాల్డు ౧౬ ఏండ్లు మూగవాడు గనుండి మొన్న మొన్ననే మాట్లాడు శక్తిని సంపాదించగలిగినాడు. ఒకనాటిరాత్రి ఉద్యోగమిచ్చిన యజమాని తెలియకుండా వెనుకకు వచ్చి ఉన్నట్టులుండి అరచెను. మెర్డొనల్డు అదరిపడి మూర్ఛిల్లెను. మరల స్పృహరాగానే, ఆతడు అతికయూ అతకని మాటలు మాట్లాడ జొచ్చెను. ఇపుడు ఆతడు సరిగా మాటలాడగలుగుచున్నాడు.

---

## లండనులో కప్పలు, పాములతో తిను బండారములు

జాన్ హెచ్ స్క్రీవిన్ అనునతడు పశ్చిమ బ్రిటనులో కారన్వాలో ఒకకప్పలు క్షేత్రమునకు యజమాని. కప్పలతినునది ఫ్రెంచివారలు మాత్రమే కాదనియు లండను"చార్వాకులు" [Epicures]—అనగా భోజనప్రియులన్నమాట—ఎంత ధరయైనను ప్రాలుమాలక తన సరకును తెప్పించుకొనుచున్నారనియు, తాను తన సరకులను ఫ్రాన్సుకు, అమెరికాకుగూడ ఎగుమతి జేయుచున్నాననియు స్క్రీవిన్ చెప్పుచున్నాడు. నవంబరు మొదలుకొని జూనువరకు వాటిబుతువులో ఆతడు ప్రతివారము దాదాపు ౨౦౦౦ కప్పలను ఎగుమతిచేయునట. ఈ బుతువుఅయిన తర్వాత మూడు వారములలో ఆతడు ముండ్లపందులు, నీరుడములు, పాములు పెంచివ్యాపారము చేయును. ఒకప్పుడవి ఒకదేశమునుండి మరొకదేశమునకు సంచరించు ఎలుకలు మున్నగు హీనకులములవారలచే ఉపయోగించబడి,మరెవ్వరిచేతను తాకబడకుండెడివట. ఇపుడో లండనులో ఇవిఎక్కువగా అమ్మడగుచున్నవట. ఇవి ఒక్కొక్కటి రెండు షిలింగుల ధరగలవై, వేగించినపుడు రుచికరముగ నుండునని లండను భోజనప్రియుల అనుభవము.

---

## ప్రాచీన నగరమును భూగర్భమున కనుగొనుట

నర్మదా నదీప్రాంతమున పరిశోధన చేయు సంఘమువారు వి. ఆర్. కరండికర్ గారి అధ్యక్షతన హోల్కారుగారి సంస్థానములోక్రొవడులో ఒక ప్రాచీననగర శిథిలములను కనుగొనిరి. ఈనగరము క్రీస్తుశక ప్రారంభమునకు పూర్వము వెలసినదని తలచబడుచున్నది. రెండు మట్టికుప్పలమధ్య ఇటుకలు, పెంకులు,కుండసామగ్రి కనుగొనబడినది.

---

## వధూవరుల మార్కెట్టు

బ్రెటనులో పూర్వకాలమున వధువులకు కావలసిన వరులకు వధువులు, వరులుకావలసిన వధువులకు వరులు మార్కెట్టులో దొరకుచుండెడివారు. మధ్యకాలములో ఆయాచారము పోయియుండెనుగాని, తిరిగి ఇపుడు ఆయాచారము మార్లెజిల్లాలో వచ్చినది. పద్ధతియేమనగా వరులందరును మార్కెట్టులో ఒకచోట నుంచబడుదురు. బాలికలువచ్చి ఎవరికి కావలసిన వానిని ఆపె[త్రవఇంటికి పిలుచుకొనిపోయి విందుచేయును విందైనతర్వాత యువకులు బాలికలను షికారుకు అడవులకు తీసికొనిపోయెదరు. అక్కడ నిశ్చితార్థము జరుగును. రాత్రిపూట గర్భాదానము ద్యాన్సులతో సహా రమ్యముగా జరుగును.

---

## ముద్దుపెట్టుకొనని భర్తను వదలిన స్త్రీ

ఒక ఫ్రెంచిస్త్రీ తనభర్త తనసెప్పుడుగాని ముద్దుపెట్టుకొనలేదనియు, తనసెప్పుడుగాని అతనిని ముద్దుపెట్టుకొననీయలేదనియు ప్యారిసునగరములోని సీన్ ట్రిబ్యునల్ [న్యాయ విచారణకర్తల సంఘము] ఎదుట దావాచేసెను. భర్త తనకు పసితనమునుంచి ఎవరిని ముద్దుపెట్టుకొనుటగాని, ఎవరిచేతగాని ముద్దుపెట్టించుకొనుటగాని అలవాటులేదని యా సమాధానమిచ్చెను ఈదావా ఎట్లు పరిష్కరించబడినదో తెలియుటలేదు.

---

## రాత్రివేళ ఇంద్రధనస్సు

ఒర్మైలో ష్వైబూలో గతవారముక్రింద ఒకరోజు పెద్దవానకురిసి పిడుగుపడినతర్వాత, మేఘములన్నియుపోయి, ఆకాశముశుభ్రమై, మరల చంద్రప్రకాశము ఏర్పడినపుడు చంద్రునికెదురుగ ఇంద్రధనుస్సు కనపడెనట. అది అర్ధగంటసేపు ఉండెనట.

---

తనమాతృభాషాజ్ఞానము లే
నిభారతీయుని
ఏమనవలెన?
అతనిని భారతీయుడని
చెప్పదగునా???

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA
HYDERABAD-DECCAN
The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper
for H E H The Nizam's Dominions

వర్తకులారా
నిజాంరాష్ట్రపు ఎనిమిది
జిల్లాలలోని ఆంధ్రులు
లో మీవర్తకవృద్ధికి
సాధనము? గోలకొండ
పత్రికలో ప్రకటనము

Vol. 11. | Thursday 2—7—1936 | No. 16

## వర్ణాంతర వివాహములు సక్రమములైనవే

—

వ్యాసకర్త
డాక్టర్ భగవానుదాసుగారు

—

యుక్తాయుక్త పరిజ్ఞానము లేకుండ ప్రతివారితోను కలసి భోజనములు చేయుటగాని వివాహసంబంధములు చేయుటగాని మంచి ఆచారముకాదు నిజమేకాని యుక్తాయుక్త విచక్షణ యననేమి దానిఅంతరార్థమును మాత్రము మనము సరిగా గ్రహించుటలేదు

మానవులకు సంభవించెడి వ్యాధి బాధలలో నూటికి ౯౦ వంతులు ఆహారపదార్థముల లోపములవల్లను, స్త్రీ పురుష సంగమములలోను దాంపత్య సంబంధములలోను గల అవకతవకలవల్లను సంభవించి మానవుడు నిండు దార్ఢ్యమును శరీరవికాసమును పొందగల్గుటలేదు

ఇట్లు మనశరీరము వ్యాధిబాధలకును మనోవ్యథలకును లోనై పరిపూర్ణవికాసమును పొందజాలక యుండుటకు మూలహేతువులలోనొకటి దాంపత్యలోపమైయున్నది కాబట్టి మానవజాతి పుష్టిగావర్ధిల్లుటకు వివాహసంబంధములు సంఘములో సవ్యముగా జరుగుచుండవలెను

### జ్యోతిషశాస్త్రము, జాతకసిద్ధాంతములు

జ్యోతిషశాస్త్ర రహస్యములను కార్యకారణ సంబంధములతో వివరించగల సామర్థ్యము మనకు లేకపోవచ్చును కాని, ఆశాస్త్రసిద్ధాంతములయందును ఆశాస్త్రసిద్ధాంతముల ననుసరించుగణిత ఫలితములయందును ప్రత్యక్ష సత్యము కొంత కన్పించుచుండుటవల్ల ప్రజలలో విశేషసంఖ్యాకులకు జ్యోతిష్యము నమ్మకమేర్పడియేయున్నది కాబట్టి మనజాతకసిద్ధాంతమునుబట్టి జన్మలక్షణవిచారణ ఏరీతిగా జరుగుచున్నదో, అట్టి జన్మలక్షణ విచారణ ననుసరించి వర్ణభేదనిర్ణయ మెట్లు చేయబడుచున్నదో చూచెదముగాక

మనలో వివాహసంబంధములను నిశ్చయించుకొనుటకు పూర్వము వధూవరుల జాతకములను పరీక్షించుచున్నాము వధూవరుల సహజప్రకృతులు సమానముగా నున్నవా లేవా యని తెలిసికొనుటకొరకే జాతకపరీక్ష చేయుచున్నాము

జాతకశాస్త్రమునందు గొప్పపరిశోధన చేసిన జంగ్ అను యూరోపియను పండితుడు "ది గోల్డెన్-ఫ్లవర్" (సువర్ణపుష్పము) అను గ్రంథమును రచించెను. ఇది ౧౯౩౦ సం॥లో ప్రకటింపబడెను ఈ గ్రంథంలో ౧౪౩ వ పుటలో ఆయన ఏమి వ్రాసెనో ముఖ్యముగా చూడదగియున్నది. జన్మించిన లగ్నమునుండియు ఆ జీవియొక్క చిత్త ప్రవృత్తి ఏరీతిగా క్రమానుగత పరివర్తనము చెందగలదో నిర్ణయించుటకు అవకాశముకలదు పూర్వసంచిత కర్మపరిపాక మంతయును జన్మించిన శిశువునందు ఏవిధముగా అవతరించియున్నదో నిరూపింప వచ్చును అని ఆయన వ్రాసియున్నాడు అందువల్లనే మనలోని పూర్వాచార పరులు ౨౭ తత్వభేదములలో వధూవరులకు ఏ తత్వములు ఏలక్షణములు పరిసమానంగా కలియుచున్నవో ముందుగా జాతక చక్రమునుబట్టి గుణించి చూచుచుందురు ఈవిధమైన పరిశోధనలనుబట్టి చూడగా, వధూవరులకు చిత్తప్రవృత్తి సమానధోరణిలో నుండవలెననియు అందువల్లనే వారి దాంపత్యము, వారి సంసారజీవితము సౌఖ్యవంతముగా నుండగలదనియు అర్థమగుచున్నది

జాతక చక్రమును పరిశీలించి గుణించి నప్పుడుజాతకుడు ఏకులములో పుట్టెనో అకులములోనివాడు కాజాలడనియు మరొక వర్ణమునకు చెందినవాడగుననియు ఒక్కొక్కప్పుడు నిర్ణయమగుచుండగలదు దీనియొక్క అంతరార్థమును మీరు శ్రద్ధగా పరిశీలింప గోరెదను జాతకుడు ఏవర్ణములో బన్మించినప్పటికిని, యుక్తవయస్కుడైన పిమ్మట అతడు మరొక వృత్తికర్మయందు అభిమానంకలవాడై మరొక వర్ణమునకు ఆరుడౌనని మనప్రాచీన జ్యోతిషశాస్త్రజ్ఞులు నిర్ణయించుచుండిరి ఆ రీతిగా నిర్ణయించవలెనని శాస్త్రప్రమాణములను గ్రంథములలో సూత్రీకరించియుండిరి కనుక ఒక వర్ణములో జన్మించినవాడు మరొక వర్ణమునకు తగిన చిత్త ప్రవృత్తికలిగి మరొక వర్ణస్థుడగుట సుసాధ్యమనియే వారి జాతక ఫలనిర్ణయ సూత్రములవల్ల విదితమగుచున్నది

### సవర్ణవివాహ మనగా నేట్టిది?

సమాన చిత్తప్రవృత్తికలవారే సమానవృత్తి కర్మలయందభిరుచి కలవారై సవర్ణు లనదగియుందురు అట్టి సమప్రవృత్తికలవారివివాహమే సంఘమునకును, దంపతులకును శ్రేయస్కరమనిభావించి అట్టివివాహమునే సవర్ణవివాహములని పెద్దలు నిర్ణయించిరి మన సంఘములో యిప్పుడు జరుగుచున్న వివాహములే నిజముగా అసవర్ణ వివాహము లనదగును ఈపద్ధతి వ్యాపించుచుండుటవల్లనే వర్ణసాంకర్యము ప్రబలెనని మనపెద్దలు చెప్పిరి వధూవరులిద్దరును ఒకేకాలమునకు చెందినవారు గనుక సవర్ణవివాహ మనుటకు వీలులేదు ఒక్కొక్కకులమువారు నేటికాలమందు తమకులవృత్తినే ఆశ్రయించుకొని జీవించుట లేదు తదితరకులవృత్తులకుకూడ దిగుచున్నారు అట్టిచోవారు భిన్నకులములకు చెందినవారగుదురు అట్లయ్యును వారుకులమును మార్చుకొనుట లేదు నామమాత్రంగా ఒకేకులమునకు చెందియు, భిన్నవృత్తుల నవలంబించినవారు వియ్యము పొందినప్పుడు అది నిజముగా అసవర్ణవివాహసంబంధమగును లేదా వధువుయొక్క ప్రవృత్తి ఒకవర్ణమునకు తగినదైయుండి, వరునియొక్క ప్రవృత్తి మరొకవృత్తి యందభిరుచికలదై యున్నప్పుడు అట్టి దాంపత్యముకూడ అసవర్ణ వివాహమే యగును

జన్మతః ఏర్పడునది స్వభావము స్వభావము ననుసరించి గుణము ఏర్పడును గుణముననుసరించి వృత్తి కర్మ ఏర్పడును కర్మననుసరించి చాతుర్వర్ణములును ఏర్పడుచున్నవి కాని అప్రభింశమైన మన సంఘములో నేటి వ్యవహారాచారము లన్నియు పైజెప్పిన సిద్ధాంతమునకు ప్రత్యక్షవిరుద్ధముగా తల్క్రిందుగా జరుగుచున్నవి

దేశములోనున్న వివిధజాతులవారి నందరిని ఒక వర్ణవ్యవస్థా సంప్రదాయములోనికి తీసికొనివచ్చి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రులనెడి వర్గములుగా వృత్తులనుబట్టి విభజించి ఒక్కొక్కవర్గములో చేరిన వివిధజాతులవారికి అన్యోన్య సంబంధ బాంధవ్యములు వృద్ధియగుట కవకాశములను సమాన వృత్తికర్మ సాంగత్యప్రభావమువల్ల కల్పించి దేశములోని ప్రజలనేగాక మానవకోటినికూడ సమ్మేళనము చేయవలెనని మనపెద్ద లుద్దేశించిరి వీలైనంతవరకు వివిధ జాతిమత భేదములనుబట్టి ప్రజలలో చీలికలేర్పడకుండ మేళవించుటకొరకే యీవర్ణవ్యవస్థ ఏర్పరుపబడినది కాని నేటికాలమునకు యీవర్ణవ్యవస్థను పురస్కరించుకొనియే చాతుర్వర్ణములు అష్టాదశవర్ణములై ఇంకను శాఖోపశాఖలుగా చీలి జాతియంతయును భిన్నభిన్నముగా తుత్తునియలై శిథిలావస్థలోనికి దీసికొనిరాబడినది కర్మకారణముచేత వృత్తిని నిర్ణయించవలెనను బాధ్యతను జవాబుదారీని పెద్దలు నిర్ణయింపజాలక యీశ్రమ తాముపడలేక జన్మకారణమువల్లనే ఏవర్ణంలో పుట్టినవాడు స్థిరాక్షరంగా ఆవర్ణంలోనే, చేరినవాడగునని నిర్ణయింపసాగిరి ఆవృత్తిలోనివారు తమ కులవృత్తిలోనికి వచ్చెదరను అనుమానముచేత ఒకవర్ణములోనివాడు మరొక వర్ణస్థుడగుటకు వీలులేదని కుతంత్రములు పన్నుటకై జన్మకారణంవల్లనే వర్ణనిర్ణయముకావలెనను సంప్రదాయము అనుష్ఠానములోనికి తెచ్చిరి సక్రమమైన వర్ణవ్యవస్థ అమలులోనికి వచ్చుటకు వర్ణాంతరవివాహములు తోడ్పడునే గాని, ప్రతిబంధకము కాజాలవు

లోకమంతటను ప్రతివాడును ఏదోవృత్తిధర్మమును అనుసరించుచు ఏదో నొకవర్ణములో చేరుచున్నాడు కనుక కులభేద సాంప్రదాయమును ప్రయత్నముతో అమలుపరచి కట్టుదిట్టములు చేయవలసిన అవశ్యకత ఏమికలదని కొందరు ప్రశ్నింపవచ్చును.

కులకట్టుబాట్లలోగల విశేషాంశము, ఒక కులవృత్తిలో ప్రవేశపడినవాడు ఆకులవృత్తి ననుసరించుచు వారికే కులవృత్తిని అవలంబించుటకు వీలులేకుండ నిబంధించుటయే అయితే ఎవనియిష్టప్రకారం వాడు ప్రవర్తింపవచ్చునని వాదింపవచ్చును ఈవాదమునకుకూడ కొంత హద్దుండవలెను ఒకసంఘములో మనము కలియున్నప్పుడు సంఘ శ్రేయము కొరకు మనమిచ్చవచ్చిన స్వలాభాపేక్షనే ప్రధానంగా గమనించి మితిమీరి ప్రవర్తించుటకువీలులేదు సంఘము సుఖంగా వర్ధిల్లుచున్నప్పుడే మనముకూడ వర్ధిల్లుచున్నాము సంఘక్షేమమునే సర్వప్రధానంగా భావించవలెతినెడి సాంఘికవాదులు వ్యక్తిస్వాతంత్ర్యమును పూర్తిగా అరికట్టి అణచివేయవలెననియు, సొంతఆస్తిఅనేది ఉండనే ఉండకూడదనియు, ఎవనియిష్టప్రకారమువాడు జీవితవృత్తిధర్మములను అవలంబించుటకూడ వీలు ఉండరాదనియు మరియొకకోటిలో చేరుచున్నారు. వ్యక్తిస్వాతంత్ర్య సిద్ధాంతమున్ను సాంఘికవాదులసిద్ధాంతమున్ను మితిమీరినవాదములు. ఈ రంటిని సమన్వయించుటకు తగిన సవ్యమైన వ్యవహారపద్ధతి వర్ణవ్యవస్థయే. ఎవరి యిష్టమైనవృత్తిని వారు అవలంబింపవచ్చునుగాని, ఒకవృత్తిలోనున్నవాడు మరొకవృత్తిని చేపట్టకూడదు. జడ్జిగానుండేవాడు మరొకవర్తకవ్యాపారములో వాటాలను కలిగియుండకూడదు ఒక బ్యాంకు డైరక్టరుగాగాని భాగస్వామిగాగాని ఉండకూడదు. వడ్డీవ్యాపారం చేయరాదు. అదేవిధంగా క్షత్రియుడున్ను కట్టుబాటులో నుండవలెను. వైశ్యుడుకూడా ఆక్షేపకారంపోలీసు ఉద్యోగంలో చేరకూడదు ప్రభుత్వంవారుకూడ యిట్టికట్టుదిట్టములను సరిగానడుపుచు తగినప్రతిఫలములను అర్హతావకాశములను జీవితభత్యములను నిర్ణయించవలెను.

ఈపూర్వపద్ధతులయొక్క కట్టుబాటుల అంతరార్థములను సార్థకత్వమును పెద్దలు నేడుపూర్తిగా మరచిపోయిరి నిర్లక్ష్యముచేసిం ఎవరినైనా వెలివేయుట త్రిము కులపెద్దలు శ్రద్ధగా పెద్దంతముపట్టుచున్నారు వర్ణాంతర వివాహములనునిషేధించుటమాత్రము వారికిచేతనైనపనిగానున్నది ఈ వర్ణాంతరవివాహనిషేధనియమముతో లగవలెనంటే శాసనప్రమేయము ముఖ్యముగాకావలసియున్నది ఎందువల్లనంటె వివాహవిషయములో అస్తిహక్కులవిషయముఇమిడియున్నది అట్టి హక్కుస్వాతంత్ర్యములు వర్ణాంతరవివాహితులకు సంక్రమింపవలెనంటే వారివివాహములు సక్రమమైనవని శాసింపవలసియున్నది. వర్ణాంతరవివాహములవల్ల సంఘమునందుకలిగెడు వైపరీత్యమేదియు లేదు

"శ్రీ సమానశీలవ్యసనేషుసఖ్యం" అనే సంస్కృతారోక్తి ననుసరించి సమానచిత్తప్రవృత్తిగల సమానధర్మధర్మములుగలవారే అనురాగప్రీతులై వివాహమాడగలరు. అవియే సవర్ణవివాహములు

—



Printed and Published by B. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor K. Balakrishna Reddy.